# విశ్వప్రకాశం


ఆధ్యాత్మిక మాసపత్రిక

దసరా ప్రత్యేక సంచిక

అక్టోబరు, 1996

సంపుటి : 2 సంచిక : 12 వెల : రూ. 5-00





ప్రకాశకులు

సర్వార్థ సంక్షేమ సమితి

501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్

గాంధీనగర్, హైదరాబాద్ 500 380


ఈ సంచికలో ...


మానవజీవనం సార్థకం చేసుకోవాలి

- శ్రీ విశ్వంజీ ప్రబోధం 2

సంపాదకీయం 3

దివ్యయోగి చరితామృతం

శ్రీనీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాధులు

- ఆచార్య బి. రామరాజు 9

శ్రీవల్లభ చరితామృతం

- శ్రీ కళాధర భట్ 16

అనుభవ తరంగిణి

- విద్యాసాగరశర్మ 19

నీ వెవరు ? నీ ధర్మ మేది ?

- శ్రీ బ్రహ్మానంద భారతి స్వామి 21

ఓరుగల్లు సాహితీ

కళాతపస్వి కన్నుమూత

- శ్రీ పి.వి. మనోహరరావు 25

అమృతం కురిసిన అరుణగిరి

- శ్రీ కస్తూరి భాస్కరరావు 29

# మానవ జన్మను సార్ధకం చేసుకోవాలి

## శ్రీ విశ్వయోగి విశ్వంజీ ప్రబోధం

యోగులు, సిద్ధ పురుషులందరూ ఆధ్యాత్మిక తత్వ వేత్తలని వారి జీవితాలను ఆదర్శంగా తీసుకోవాలని శ్రీ విశ్వయోగి విశ్వంజీ అభిలషించారు. హుడాకాలనీలోని శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవాలయంలో శ్రావణ మంగళవారం రాత్రి భక్తులనుద్దేశించి ఆయన ప్రసంగించారు. జీవితం చాలా విశిష్టమైనదని మనుజ జన్మను సార్థకంచేసుకోవాలని అన్నారు. అర్థవంతమైన జీవితాన్ని గడుపుటకు మనసా, వాచా, కర్మణా ధర్మమార్గం అనుసరించాలని ఆయన ప్రబోధించారు. సనాతన ధర్మాన్ని పాటిస్తే మానవుడు దివ్యమైన వ్యక్తిగా మారతాడనీ, ధర్మాధర్మాలను తెలుసుకొనాలనీ స్వామీజీ బోధించారు. దివ్యమైన సంకల్పం, దైవ అనుగ్రహంతోనే మానవ జన్మ సార్థక మవుతుందన్నారు. మానవుని దేహమేదేవాలయమని, హృదయమే దైవ పీఠమని, ప్రతి ఒక్కరు భగవంతుని దివ్యమైన రూపాలేనని స్వామీజీ పేర్కొన్నారు. పంచేంద్రియాల ద్వారా ప్రతి నిత్యం గ్రహించేది ఆహారమని, ఇది శుద్ధంగా ఉండాలని ఆయన అన్నారు. ప్రతి మనిషి జీవితాన్ని ప్రసాదించే స్త్రీమూర్తికి రుణపడి ఉన్నాడని అన్నారు. దివ్యమైన ఉపనిషత్తులలోని మంత్రోచ్చారణ ద్వారా మనిషి తనలోని మాలిన్యాన్ని కడుగుకోవాలని అన్నారు. ప్రతి ఉదయం గాయత్రి మంత్ర పఠనం వల్ల రాత్రి దోషాలను, సంధ్యావందనం ద్వారా పగటి దోషాలు పోగొట్టుకుంటాడని వివరించారు. జ్ఞానం గల ప్రతి ఒక్కడూ బ్రాహ్మణుడేనని, మనస్సును పవిత్రం చేసుకుని హృదయంలో ప్రేమ కలిగి వుండాలని అన్నారు. సనాతన ధర్మాన్ని ఆచరించక, గాయత్రి మంత్రాన్ని ఉచ్చరించక ఎన్ని పూజలు చేసినా శూన్యమని విశ్వంజీ ఉద్బోధించారు. రాబోయే కాలంలో భారతదేశం ప్రపంచదేశాలకు గురు స్థానానికి వెళ్తుందని విశ్వయోగి విశ్వంజీ ఉద్ఘాటించారు.

(ఈనాడు 22.8.96 సౌజన్యంతో)

సంపాదకీయం

# నైతిక ప్రమాణాలు

'దిన యామిన్యౌ సాయం ప్రాతః, శిశిర వసంతౌ పునరాయాతః' అని చెపుతున్నది శంకరభగవత్పాదుల విరచితంగా ప్రసిద్ధమైన భజగోవింద స్తోత్రం. ఆయన కొన్ని శ్లోకాలు చెప్పగా వారి శిష్యులు కూడా ఈ స్తోత్రంలో కొన్ని శ్లోకాలు అందుకున్నారని ఐతిహ్యం. ఏది ఏమైతేనేం సర్వవేదాంత దర్శనంలో, స్తోత్రవాఙ్మయంలో అగ్రగణ్యమైనది, మహత్వపూర్ణమైనది ఈ స్తోత్రం. దీనికి 'మోహముద్గరం' అని కూడా పేరు. అంటే ప్రాపంచికమైన అజ్ఞానం, అవివేకం, వ్యామోహం వంటి బంధనాలకు గండ్రగొడ్డలి వంటిది అని అర్థం. కేవలం ఈ ఒక్క ప్రబోధ స్తోత్రాన్ని ఆలంబనంగా చేసుకొని ఎందరో వివేకవంతులైనారని పెద్దల కథనం.

ఇంతకూ ఏమిటి ఈ పైవాక్యం బోధించేది? అంటే పగలూ, రాత్రి ఒక దాని వెనక ఒకటి తరుముకుంటూ పరుగులు తీస్తున్నాయి, కాలం వడివడిగా గడచిపోతూనే ఉన్నది. శిశిరం ఆ వెనుక వసంతం మాటిమాటికీ కాలరంగస్థలాన్ని సజ్జితం చేస్తూనే ఉన్నాయి. సర్వప్రకృతి మోడువారి హిమాచ్ఛాదితమై కొరడు వారినా మళ్ళీ నవపల్లవ పుష్పఫలభరితమై నిత్య నూతన రామణీయకాన్ని వెలారిస్తూనే ఉన్నది.

ఇదే విధంగా మానవుడు కూడా పదేపదే తన ప్రవృత్తిని ప్రదర్శిస్తూనే ఉన్నాడు. తన మంచితనాన్ని ఎంచి చూపుతూనూ ఉన్నాడు. కాని చీకటి వెలుగులు తప్పటం లేదు. ఎందరు ప్రవక్తలు, ఎన్ని అవతారాలు, ఎందరు మహర్షులు, మహా పురుషులు, మహనీయులు, మహాత్ములు, పరమయోగులు, తత్త్వవేత్తలు, దార్శనికులు యుగయుగాలుగా ప్రభోదిస్తూ వచ్చినా కుక్కతోక లాగా మానవ ప్రవృత్తి కూడా మార్చడానికి శక్యం కాకుండా ఉంది. పంటపొలానికి చీడపీడలు తప్పనట్లే, పచ్చనితీగకు పురుగు బాధ తప్పనట్లే స్వార్థపరత్వం, ఆశ, దురాశ, దురన్యాయం, దుర్మార్గం, మానవజీవితాన్ని, సాంఘిక ప్రవృత్తిని పట్టి ఆవదల పాల్జేస్తూనే ఉన్నాయి.

ఒక బుద్ధభగవానుడు, ఒక క్రీస్తు యేసు, ఒక గాంధీ మహాత్ముడు ఏం

ఒయ్యాలిగాలా దుఃఖసంక్షోభాలతో మానవుడు తలవంచుకోవలసి వస్తున్నది. తల దించుకోవలసి వస్తున్నది. ప్రపంచ నాగరక సమాజంలో మానవుడికి ఇవాళ శాస్త్ర విజ్ఞానం సకల సదుపాయిలు, సౌకర్యాలు సమకూర్చింది కదా! అణ్వస్త్ర యుద్ధాలెందుకు? ఇతర దేశాలను సాంఘికంగా, రాజకీయంగా, వ్యాపారకంగా, మతప్రాతిపదికంగా దురాక్రమించాలన్న దుర్బుద్ధులెందుకు? 'వసుధైవ కుటుంబకం' అని అన్ని మతాలు, అందరు తత్త్వవేత్తలు, మత ప్రవక్తలు ఆశంసిస్తున్నప్పుడు నాగరక దేశాలకు సైనిక వ్యవస్థలెందుకు? దారుణమారణ కలహాలెందుకు? కచ్చలెందుకు? కార్పణ్యాలెందుకు? శాంతి కాముకదేశాలపై కాలుదువ్వడాలెందుకు? ఎందుకు? ఎందుకు? ఎందుకు?

మన ఇల్లు మనం చక్కదిద్దుకుంటే ప్రపంచాన్ని ఉద్ధరించినట్లు? మన భారతదేశ పరిస్థితి చూడబోతే ఇప్పుడు చాలా దయనీయంగా ఉంది. పరమ బాధాకరంగా ఉంది. మనసున్నవాళ్ళకు, మానవత్వాన్ని కాంక్షించేవాళ్ళకు ధనమాన ప్రాణహాని నుంచి రక్షణ కోరే సామాన్య ప్రజానీకానికి ఇవాల్టి భారతీయ సామాజిక వ్యవస్థ ముఖ్యంగా రాజకీయ వ్యవస్థ పరమ విషాదకరంగా, అత్యంత సంతాపకరంగా, దుర్భర ఆందోళనకరంగా తయారైంది. 'ధర్మానికి గ్లాని కలిగినప్పుడు నన్ను నేను సృజించుకొని అభ్యుత్థానమైన అధర్మాన్ని నిగ్రహిస్తాను, పరిస్థితులను చక్కదిద్దుతాను.' అని హిందువులు నమ్మే భగవంతుడి మాట నిజమా కాదా? అని సంశయాందోళిత విచలిత విచార మనస్కులవుతున్నారు భారతీయులు. ఒక వ్యవస్థ, ఒకనీతి, ఒక ధార్మిక చింతన, ఒక కట్టుబాటు, ఒక పాపభీతి, ఒక సాంఘిక బాధ్యత, తోడి మానవుల పట్ల ఆర్ద్రత, ప్రేమభావం, కరుణ, మైత్రి, దయ సంఘంలో క్రమక్రమంగా రోజురోజుకు లుప్తమై పోతున్నాయి. సమస్త నక్షత్రకాంతి కంటె పదహారు రెట్లు విలువైనది, ఆహ్లాదకరమైనది, తాపప్రశమనమైనది వెన్నెల, అట్లానే సమస్త సద్గుణాల కంటే మైత్రి -అదిన్నీ సకల జీవకోటి పట్ల ప్రసరింపచేయటం నేర్చుకోండి-అని బుద్ధ భగవానుడు ప్రబోధించాడుట. సమాజ జీవన వివిధరంగాలలో ఇప్పుడా మైత్రి ఎక్కడా కన్పించటం లేదు. ఎందుకూ కొరగావటం లేదు.

మానవుడు తన స్వార్థం, తన సుఖం, తన సౌకర్యం, తన ఆత్యాశ ప్రవర్తించనంత వరకు మంచివాడుగానే ఉంటున్నాడు. ఎప్పుడైతే అవి పరిగణనలోకి తనకు తెలిసో

తెలియకో వస్తున్నాయో అప్పుడు కలహశీలి, దుష్ప్రవర్తకుడు అవుతున్నాడు [illegible] అసౌకర్యాలను, సుఖదుఃఖాలను, మంచి చెడ్డలను ఏ మాత్రం ఖాతరు చేయటం లేదు అజ్ఞానులు, అవిద్యావంతులలోనే కాదు సర్వేసర్వత్రా నేడు ఇది విజృంభిస్తున్నది.

ఏరోజు దిన పత్రిక చూచినా దుఃఖోద్విగ్నకారకమైన పతాక శీర్షికలు, ప్రముఖ వార్తలు, ప్రధాన విశ్లేషణలు, భయకంపితులను చేసే వాస్తవాలు వెలుగు చూస్తున్నాయి. ఇట్లా అయితే మానవుడి మనుగడ ఎట్లా? అన్న పరితాపం కలిగిస్తున్నాయిఈ వార్తలు, వాఖ్యలు, విశ్లేషణలు.

నేడు సంఘంలో ఈ విషాదకరమైన పరిస్థితులన్నిటికీ ఈ ఏభై సంవత్సరాలు అంటే భారతదేశం స్వాతంత్ర్యం సముపార్జించుకున్న తరవాత గడచిన ఈ అర్థశతాబ్ది కాలంలో పరిపాలన వ్యవస్థను నిర్వహించిన వారే బాధ్యత వహించాల్సి ఉంటుంది. 'యథారాజా తథాప్రజ' అనే సూక్తి వారికి అక్షరాలా వర్తిస్తుంది. కుటుంబ యజమాని తాగుబోతు, దుర్వ్యసన పరుడు, దుఃఖకారకుడు అయితే ఆ కుటుంబంలోని వివిధ వ్యక్తులను తప్పుపట్టి ప్రయోజనం లేదు. ఒక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు అవినీతి పరుడు, దుష్టుడు, దుర్మార్గుడు అయితే ఈ పాఠశాల విద్యార్థులు తమ విద్యాభివృద్ధిలో సత్ఫలితాలను సాధించలేరు. అట్లానే పరిపాలకులు అలసులు, అధర్మపరులు, నేర చరితులు అయితే ఆదేశం ఎట్లా బాగుపడేను?

భాగవతంలో వేనరాజు కథ ఉంది. ఇప్పుడు మన దేశంలో అటువంటి వేనరాజులు ఎందరో బయలుదేరారు! ఆశ్చర్యం ఏమంటే లెక్కకు మిక్కిలి ఆధ్యాత్మిక కార్యక్రమాలు, మఠాలు, సద్గోష్ఠులు, సామూహిక ప్రబోధాలు, దేశంలో విస్తరిస్తున్నా [illegible] దామాషాలో లంచగొండితనం, అవినీతి, అక్రమార్జన, దౌర్జన్యం, మో[illegible], కపటం, కక్ష, అధికార దాహంకూడా వ్యాప్తి చెందుతూనే ఉన్నాయి. [illegible] ఎవరూ న[illegible] సంవత్సరాలు జీవించమనీ, తాము ఆర్జించి దాచిన సొత్తు సక్రమ వినియోగమే అవుతుందో లేక తమ సంతానం వ్యసన [illegible] కావడానికి దోహదమవుతుం[illegible]జాల మనీ అందరికీ తెలుసు. అయినా ఇంకా ఇంకా [illegible]లని [illegible]మాలు చేయాలనీ, సుఖభోగాలు, విలాసాలు, సౌకర్యాలు సమకూర్చు[illegible]లనీ మానవుడు కాంక్షించడం ఎందుకో? అటువంటి వెసులు బాటును వర్తమాన పరిపాలన వ్యవస్థ [illegible]స్తున్నందువల్ల

చదువు, సంస్కారం కోరుకునే వాళ్ళు కూడా దొంగలూ, దోషులు అవుతున్నారు. తన పాలితుల నుంచి ఆదాయం పన్ను సక్రమంగా చెల్లించకుండా ప్రభుత్వమే ప్రోత్సహిస్తున్నది. ప్రతిచిన్న పరిపాలనా శాఖలోనూ అక్రమార్జనకు దిగువ స్థాయి నుంచి అత్యంత ఉన్నత స్థాయి వరకు పై అధికారులు దోహదం చేస్తున్నారు. రాజకీయపక్షాలు, అధికార రోగపూరితులు, కులమత విభేదాలను సంఘంలో సృష్టించి తమ పబ్బంగడుపుకోవటానికి ఎటువంటి అక్రమాలకైనా వెనుదీయటం లేదు, ఒక వైపున, దూష్యమైన, అసహ్యకరమైన అధికార దాహం, విలాస జీవన పిపాస, మరి ఒక వైపున శ్రమ నిష్ఫలమై, జనిదుర్భరమై అలమటించే అభాగ్య జన సందోహం, ఎక్కడ చూచినా త్రొక్కిసలాటలు, తోపులాటలు, ఏమిటో, ఏమిటో పొందాలని, ఏమిటో కావాలని ఆరాటాలు సామాన్య మధ్యతరగతి జన జీవితాలలో కూడా మోసులెత్తుతున్నాయి.

సాంఘిక సుస్థితి (?) ఆశయంగా చేసుకొవాల్సిన వినొద సాధనాలు, సినిమా, టెలివిజన్‌ల పోకడలు పరమదుర్భరంగా ఉంటున్నాయి. యువతరాన్ని తప్పు దోవ పట్టిస్తున్నాయి. తాము కూడా వెండి తెరపైనో, బుల్లి తెరపైనో ఎలాగైనా కన్పించాలని లేత హృదయాలు ఆరాటపడేటట్లు ఆ కార్యక్రమాలు, ప్రదర్శనలు రూపొందుతున్నాయి. హింస, కామోద్రిక్తత, వెకిలితనం, వెగటుపుట్టించే చేష్టలు, అసహజ అశ్లీల భంగిమలు, పవిత్రమైన కళారాధనగా చెలామణికావాలని ఉబలాట పడుతున్నట్లు రూపొందు తున్నాయి. ఉన్నతోద్యోగులైనా, ఉచ్ఛస్థితిగల అధికారులైనా, ధనవంతులైనా, స్థితిమంతులైనా, నిరుపేదలైనా ప్రతివారికీ ఇంకా ఏమిటో తాము పొందవలసింది పొందలేకపోతున్నామన్న వెంపర్లాట బాధిస్తున్నది. 'నీవు సుఖంగా శాంతంగా సంతృప్తికరంగా కాంక్షారహితంగా ఉన్నావా?' అని ఎవరినైనా అడిగితే నిబ్బరంగా 'అవున'ని కోటికి ఒకరైనాసమాధానం చెప్పగలరో లేదో నేడు అనిపిస్తున్నది.

పత్రికలలో రోజూ వెలువడే వార్తలు మరింత గుబులు పుట్టిస్తున్నాయి. దిగులు కలిగిస్తున్నాయి. అత్యధిక ప్రాచుర్యం గల ఒక ఇంగ్లీషు దిన పత్రికలో నేడు భారతదేశంలో సుమారు ముప్పైవేలు మఠాలు, (ఆధ్యాత్మిక సంస్కృతి ప్రాసార కేంద్రాలు) ఉన్నట్లు ఇందులో సుమారు వేయింటిదాకా కోర్టు వ్యాజ్యాలు, న్యాయస్థాన వివాదాలలోను కొట్టు మిట్టాడుతున్నట్లు వీటన్నిటికీ కలిపి ఒక వ్యవస్థ ఏర్పాటు చేయనున్నట్లు ఎసంతులు

కొందరు యోచిస్తున్నట్లు ఒక వార్త వెలువడింది. ఆధ్యాత్మిక సంస్కృతి కేంద్రాలకే ఈ పాట్లు తప్పనప్పుడు తక్కిన సాంఘిక వ్యవస్థల మాట ఏమి చెప్పాలి? అత్యధిక పాఠకజన బాహుళ్యం కల ఒక తెలుగు దిన పత్రికలో ఈ మధ్యనే ఒక విచారకరమైన వార్త వెలువడింది. ఒక ప్రముఖ నగరంలోని బాలికల హాస్టల్‌లో ఆ బాలికల భోజన వసతి బాధ్యత వహించే దుర్మార్గుడైన అధికారి హెచ్చు ధరలకు నాసిరకం కూరలు కొంటూ అవన్నీ ఎక్కువ పరిమాణంలో కొంటున్నట్లు తప్పుడు లెక్కలు చూపించగా బాలికలు ఆక్రోశించగా ఆ విషయాలను పట్టించుకోవలసిన ఉద్యోగి దానితో నాకేమిటి సంబంధం అంటున్నాడని వ్యాఖ్య! ఆ హాస్టల్‌లో తన పిల్లలే ఉంటే తానట్లా ప్రవర్తించగలనా! అని ఆ బుద్ధి హీనుడు లేదా హీనురాలు ఇంచుకంత అయినా ఆలోచించలేదు.

ఇక ప్రతి రోజూ మంత్రులు, నడమంత్రులు, నడమంత్రపుసిరి కాంతులు, కాంతలు, ప్రభుత్వోద్యోగాలలో అత్యున్నతమైన అధికారాలు, హోదాలు, స్థానాలు అలంకరించినవారు, ఉన్నతోన్నతోన్నత పోలీసు అధికారులు, ఐ.ఎ.ఎస్. ఆఫీసర్లు, ప్రభుత్వోన్నత శాఖల సెక్రెటరీలు విదేశ రాయబారులు, వెలగబెడుతున్న అవినీతి భాగోతాలు, దేశమనియెడి దొడ్డ వృక్షానికి వేరు పురుగులు లాగా దాపురిస్తున్న వైనాలు పత్రికలలో చవులూరిస్తూనే ఉన్నాయి.

ఇదీ విషాద భారతం. నైతిక విలువల ప్రసక్తి ఎందుకు? ఎక్కడ?

ఇప్పుడిక హిందూ మత ఉత్కృష్టతను గూర్చి, భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతి వైభవాన్ని గూర్చి, పండుగల పబ్బాల విశిష్టతను గూర్చి, శ్రీ కృష్ణజన్మాష్టమి, వినాయకచవితి, శరన్నవ రాత్రులు, దుర్గాపూజ, దీపావళి, నరకాసుర సంహారం, శిష్టరక్షణ, దుష్టశిక్షణ 'కాలఃక్రీడతి గచ్ఛత్యాయుః, తదపినముచత్యాశాపాశః'- అని సంపాదకీయాలుఎందుకు? అవి ఏ ప్రయోజనాన్ని సాధించగలవూ ?!

మన పత్రిక విశ్వప్రకాశం ప్రచురణ రెండో సంపుటం పూర్తి అయి మూడో సంపుటంలో అడుగుపెడుతున్నది. కాని ఇటువంటి పత్రికకు రావల్సిన, కావల్సిన ఆదరణ, ఆశావహమైన భవిష్యం తెలుగు వారి నుంచి ప్రశ్నార్థకంగా రాకూడదు, కాకూడదు.

## కంచిపరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు ఇట్లా ప్రబోధించారు.

"అన్నిటికంటే ముఖ్యమైనదిప్రజల నైతిక ప్రమాణాలను అభివృద్ధి పరచడం. ధర్మమార్గావలంబనం అవసరమనే అంతఃప్రేరణ మనకు రానంత వరకు శాసనరీత్యా ఎలాంటి సంస్కరణలు తలపెట్టినా అవి నిరుపయోగమే కాగలవు. పాఠశాలల్లోనూ, ఇళ్ళలోనూ మన బాలబాలికలకు నైతిక బోధ చెయ్యడం అవసరం. వారి లేత మనస్సులను ఆకర్షించే పద్ధతిలో ఆ బోధనను రూపొందించాలి. వైద్యం, ఇంజనీరింగ్ మొదలైన విద్యలను ఉచిత వయస్సులో నేర్చుకొనవచ్చు. కాని విద్యార్థుల నడతకు నైతిక సూత్రాలకు అన్నిటి కంటె ప్రధాన స్థానం ఇవ్వాలి.

నేటి పాఠశాలల్లో విద్యార్థుల నైతిక శిక్షణతో ఏ మాత్రం సంబంధం లేని చదువులకు మాత్రమే పారితోషికాలిస్తున్నారు. బాలల శీలం కంటె వాళ్ళ ఉద్యోగాలకూ, జీవనాధారాలకూ ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వడం జరుగుతున్నది. యువతీ యువకుల నడతలను సరిదిద్దవలసినవి పార్లమెంటు చట్టాలు కావు. మన మత గ్రంథాలలో నిర్వచించబడిన మహోత్తమ ఆదర్శాలు" - నడిచేదేవుడు - పుటలు 191-192

(ప్రముఖ పత్రికారచయిత శ్రీ ఎ.ఎస్. రామన్‌కు శ్రీ స్వామివారు ఇచ్చిన ఇంటర్వ్యూ - కీ.శే. నీలం రాజు వేంకట శేషయ్యగారి గ్రంథం నుంచి)

"విశ్వ ప్రేమకుబాహ్యరూపం అహింస. తోడి మానవులనే కాదు; పశుపక్ష్యాదులను కూడా మనం ప్రేమించాలి. ప్రేమ లేని బ్రతుకు ఎడారి వంటిది"

కంచిపరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి.

"రాజు కూడా ప్రజలవలె శాస్త్రానికి బద్ధుడు. రాచరికం ధర్మ బద్ధంగాఉండాలి. పాలకులకూపాలితులకూ ఉన్న ఈ ధర్మ శ్రద్ధే మన దేశానికి ధర్మక్షేత్రమని పేరు తెచ్చింది"- శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి. (నడిచే దేవుడు నుంచి)

దివ్యయోగి చరితామృతం

# శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాథులు

(1788-1907)

- ఆచార్య బి. రామరాజు

*(గత సంచిక తరువాయి)*

నంజుండయ్య ఆ కటిక చీకటి గుహలో కొంతదూరం నడచినాడు: ఒకచోట ఒకయోగి సమాధి నిష్ఠలో ఉన్నట్లు కనుపించింది. నంజుండయ్య ఆ యోగికి ప్రదక్షిణించి సాగిలపడి అట్లే ఉన్నాడు. కొంతసేపటికి యోగి కనులు తెరచి ఆగంతుకుని వర్తమానం విచారించి "నీ అభీష్టమేమిటి?" అన్నాడు. నంజుండయ్య "తమ సేవ చేసి కృతార్థుడనౌతాను' అన్నాడు యోగి సంతోషించి నంజుండయ్యను తమ శిష్యునిగా స్వీకరించినాడు. నంజుండయ్య గురువుల సన్నిధిలో కొన్ని సంవత్సరాలుండి పరిచర్యలు చేసి గురువులు బోధించిన యోగములన్నీ సాకల్యంగా నేర్చుకున్నాడు.

ఒకనాడు శ్రీరామానందులు నంజుండయ్యను చేరదీసి "నాకు వచ్చిన విద్యలన్నీ నీకు బోధించినాను. ఇప్పటినుండి నీపేరు సచ్చిదానందుడు. నీవు ముందుగా మీ యింటికి పోయి, నీ తల్లిదండ్రులను దర్శించి, వారికి ఆనందం కూర్చి, వారి అనుమతితో నీ యిచ్ఛ వచ్చిన చోటుకు పో! నేను నేర్పిన విద్యలు సాధించు పరహితం, భూతదయ, పామర జనోద్ధరణం మరువకు. వలసినపుడు నా దర్శనం నీకు లభిస్తుంది'అని దీవించి సాగనంపినాడు. సచ్చిదానందాపరనాముడైన నంజుండయ్య షోడశకళా ప్రపూర్ణుడైన చంద్రుని వలె వెలుగుతూ స్వగ్రామం దానమాసకు పోయి తల్లిదండ్రులకు పరమానందం కలిగించినాడు. గురువుల అనుగ్రహమూ తాను నేర్చిన విద్యలూ వివరంగా తల్లిదండ్రులకు చెప్పినాడు. వారి సంతోషానికి అవధులు లేవు. తమ కడుపులో కారణజన్ముడు పుట్టినాడని సంబరపడ్డారు. నంజుండయ్య కొంతకాలం తల్లిదండ్రులను సేవించి వారి అనుమతితో శ్రీశైలం బయలుదేరినాడు అక్కడ భ్రమరాంబా మల్లికార్జునులను దర్శించి పాతాళగంగ సమీపంలో ఒక గుహలో ప్రవేశించినాడు. ఆ గుహలో సచ్చిదానందులు 24 సంవత్సరాలు యోగాభ్యాసమూ, కఠోరతపస్సూ చేసి పరిపూర్ణ హఠయోగ సిద్ధులైనారు. అణిమాద్యష్ట

సిద్ధులు, ఘటికా పాదుకా గమనాగమనములు ఆయనకు కరతలామలకమైనవి. శ్రీశైలం విడిచి సచ్చిదానందులు ఆసేతుహిమాచలం యోగభూములు దివ్యదేశాలు తిరిగినారు. ఆశ్రయించినవారికి కొందరికి జ్ఞానము కొందరికి తీరుతీరు యోగములు బోధించినారు.

ఈ విధంగా సచ్చిదానందులు తమ యోగజీవితం 60 సంవత్సరాలు గడపి రెండవ షష్టి ధాతృ సంవత్సరం మాఘమాసంలో నిజాం రాజధాని హైదరాబాదుకు వచ్చినారు. (ధాతృ సంవత్సరం క్రీ శ. 1816 లోను, 1876 లోను వచ్చింది. మొదటి ధాతృ సంవత్సరానికి చిదానందుల వయస్సు 28 ఏండ్లు. రెండవ ధాతృ సంవత్సరానికి వారి వయస్సు 88 ఏండ్లు) తమను ఎవరూ గుర్తించని ప్రచ్ఛన్న వేషంలో స్వామివారు రాజా కందస్వామి సత్రంలో ఉన్నారు. రాజా కందస్వామి వారు నిజాం మంత్రి మండలి సభ్యులు, రాజా కిషన్ ప్రసాద్ బహద్దరు ప్రధానమంత్రులు. (ఇప్పటికీ కందస్వామి తోట, సత్రమూ ఉన్నవి. తోటలో ఒక మందిరం, ఆమందిరం ప్రక్కనే మేము చదువుకొన్న దినాల్లో హనుమాన్ వ్యాయామశాల ఉండేవి. నేనా వ్యాయామశాలకు ప్రతి దినం పోయేవాడిని. రాజా కందస్వామి మొదలియార్ తమ్ముడు ఆర్ముగం, ఆయన కొడుకు శివశంకరం, ఆయన కొడుకు వీరాస్వామి, ఆయన పెద్దకొడుకు ఆనందరావు మొదలియార్ నా సహాధ్యాయి, దేవాదాయశాఖ కమీషనర్‌గా రిటైర్ ఐనాడు) కందస్వామి వీధి ప్రారంభంలో కందస్వామి మార్కెటు ఇప్పటికీ ఉన్నది. దానికి ఎదురు సందు మోతీసింగ్ గల్లీ. ఆ గల్లీలో సమ్మెట కృష్ణయ్య నాయుడనే భక్తుడుండేవాడు. ఆ నాయుడు ఆకృష్టుడై సత్రంలో ఉండే సచ్చిదానందులను సేవించేవాడు. స్వామి సంతోషించి నాయుడును శిష్యుడుగా స్వీకరించి మంత్రోపదేశం చేసినాడు. నాయుడు చిన్నవాడు కనుక అతని బుద్ధి చలించకుండా స్వామివారు అభయప్రదానం చేసినారు. కొన్ని దినాల తరువాత స్వామివారు ఎటకో వెళ్ళిపోయినారు. ఐనా ఏడాదికొకసారి తప్పక వస్తూ ఉండటం చేత చాలామందికి వారి మహిమాతిశయములు తెలిసినవి. స్వామివారు హిందువులు, ముస్లింలు, యవనులు అనే భేదం పాటించక, వారి వారి మతాల అనుసారం ఈశ్వరోపాసకులుగా మలిచి, వర్ణాశ్రమ ధర్మాలను అనుసరించి, యోగ్యతలను బట్టి, హఠ, లయ, లంబికా రాజయోగాదులు, మంత్రములు, ఉపదేశించి అనుగ్రహించేవారు. ఈ విధంగా స్వామి దేశ దేశాలు తిరుగుతూ హైదరాబాదుకు వచ్చేవారు. ఆయా ప్రాంతాల్లో స్వామి ఎవరెవరిని అనుగ్రహించినారో తెలియదు. శ్రీశైల ప్రాంతంలో నీలకంఠయ్యగారనీ, నాగపూర్ ప్రాంతంలో వాసుదేవసూత్ర పండితులనీ, ఆసామ్ లో ఠాకుర్ బావా అనీ,

నిర్మల, మేలుకోట ప్రాంతాల్లో విశ్వనాధయ్యగారనీ హైదరాబాదు రాజ్యంలో సచ్చిదానంద స్వామి అనీ మనస్వామి పేర్లు వాడుకలో ఉండేవి.

శ్రీ సచ్చిదానందస్వామివారు ప్రమాది సంవత్సరం (1879) కృష్ణాజిల్లా పర్యటించినారు. నందిగామ తాలూకా లింగగూడెంలో సాధు పరబ్రహ్మయ్య అనే బ్రాహ్మణోత్తముడుండేవారు ఆయన పరుల అన్నోదకాలు ముట్టక, మూడు పూటల సహస్రగాయత్రి, పంచసహస్ర పంచాక్షరీ, పంచమహాయజ్ఞాలు తప్పక ఆచరించేవాడు. తాను చేసే సత్కర్మలు పరమేశ్వరునికి ప్రీతి కలిగించినవో లేదో అని ఆయన శంక. సచ్చిదానందులతని కర్మాచరణం బ్రహ్మార్పణమైనట్లు నిదర్శన పూర్వకంగా నిరూపించినారు. పరబ్రహ్మయ్య సచ్చిదానందుల వద్ద దీక్షితులై కొంతకాలం తరువాత సంసారం విడిచి శ్రీ శైలంలో తపస్సు చేసి అక్కడే సిద్ధిపొందినాడు సచ్చిదానందులు చిత్రభాను సంవత్సరం (1882) ఖమ్మంమెట్టు సమీపంలోని ముత్తగూడెంలో శ్రీ శారదా నవరాత్ర్యుత్సవాలు నిర్వహించి ఉత్తర దేశం వెళ్లిపోయినారు. ఆసామ్‌లో కామాఖ్యలో తిరుగుతుండగా విష్ణుకాంత గోసాయి అనే మహాత్ముడు సచ్చిదానందులతో మైత్రి చేసినారు. గోసాయిని 500 మంది శిష్యులు పరివేష్టించి ఉండేవారు. ఇరువురు యోగులూ బ్రహ్మపుత్రా తీరంలో కొంతకాలం తపస్సు చేసినారు. సచ్చిదానందులు మంత్ర యోగ మహిమాన్వితులని గుర్తించిన గోసాయి స్వామివారి శిష్యుడై కొన్ని యోగ రహస్యాలు నేర్చుకోవటమే కాక తమ శిష్యులకు కూడా స్వామివారి చేత ఉపదేశం చేయించినాడు. మన స్వామి పార్థివ సంవత్సరం (1885) పశ్చిమదేశం తిరిగి తుంగభద్రాతీరం వల్లభాపురంలోని ఒక దేవాలయం చేరి అక్కడ తపస్సు చేసినారు. హొసపేట, బళ్ళారి భక్తులను జ్ఞానయోగ సంపన్నులను చేసినారు. స్వామివారి కీర్తి చంద్రికలు ఎల్లెడల వ్యాపించినవి. మనస్వామి శ్రీవిద్యోపాసనాధురంధరులు, పూర్ణదీక్షాదక్షులు, శ్రీదేవీ ప్రసన్నులు. వారు సర్వజిత్తు సంవత్సరం (1887) జగ్గయ్య పేటలోను, సర్వధారి సంవత్సరం (1888) సికిందరాబాదులోను నవరాత్ర్యుత్సవాలు నిర్వహించి శిష్యకోటిని లబ్ధమనోరధులను చేసినారు.

సచ్చిదానందస్వామివారు దృఢగాత్రులు, అంతవయస్సున్నా వారి శరీరం ముడతలు పడలేదు. ప్రమాది సంవత్సరం (1879) స్వామి హైదరాబాదులో ఉన్నప్పుడు కృష్ణానందులనే యోగి వచ్చి స్వామిని దర్శించినాడు. ఆయన 30 ఏండ్లవాడుగా ఉన్నప్పుడు సమాన వయస్కులైన మనస్వామి శ్రీశైలంలో పంచమహాభూత సిద్ధికోసం

ఘోర తపస్సు చేస్తుండగా మొదటిసారి కలుసుకున్నారు. ఆనాడెంత దృఢంగా ఉండినారో ఈనాడు 90 ఏండ్ల వయస్సులో కూడా అంతే దృఢంగా ఉన్నారని కృష్ణానందులు పొగడినారు. గదగులో నందన సంవత్సరం (1892) దత్తాత్రేయ కృష్ణాజీ ఇంట్లో శారదానవరాత్రులు నిర్వహించినపుడు ఒక వృద్ధ వైశ్యుడు స్వామిని తన చిన్ననాడు 12 ఏండ్ల వయస్సులో దర్శించినపుడెట్లున్నారో ఇప్పుడూ అట్లానే ఉన్నారని పొగడినారు. ఇది స్వామివారి యోగతపోమహిమలకు తార్కాణం. స్వామివారు విక్రమ సంవత్సరం (1880) ప్రారంభంలో కొంతకాలం నాగపూర్‌లో భక్తుల వద్దఉన్నారు. అప్పుడక్కడ కోరారు నారాయణ స్వామి నాయుడనే స్వామి భక్తుడుండేవాడు. ఆ దినాల్లో నాగపూర్ నుండి హైదరాబాదుకు 3 దినాలు రైలు ప్రయాణం. కాని స్వామివారు నాయుడిచ్చిన టిక్కెట్టుతో రైలెక్కి మరునాడే హైదరాబాదులో ప్రత్యక్షమైనారు. ఇది స్వామివారి గమనాగమన సిద్ధులకు నిదర్శనం.

స్వామివారు వికృతి సంవత్సరం (1890) శరన్నవరాత్రాలు కన్నడదేశంలోని నారాయణదేవరకెరిలో నిర్వహించి కార్తీకమాసంలో బళ్లారి జిల్లా విరూపాక్ష క్షేత్రానికి సమీపంలో ఉన్న గౌరీపురం చేరినారు. అక్కడ శ్రీరాజరాజేశ్వర్యధితేవతాకమైన చింతామణి పీఠం సనాతనంగా ఉంటున్నది స్వామివారికంటె మించిన యోగ్యులు లేరని అక్కడి భక్తులు స్వామివారిని ఆ పీఠానికి పట్టాభిషిక్తులను చేసినారు. అప్పటి నుండి మన స్వామివారికి శ్రీ సచ్చిదానంద నీలకంఠ సదానంద చింతామణి స్వాములని దీక్షానామం, గౌరీపురం స్వామి అని వ్యవహారనామం వాడుకలోనికి వచ్చినవి. గౌరీపురం ఒక చిన్న శ్రోత్రియగ్రామం. ఇది హడగలి తాలూకా కేంద్రానికి పోయే బాట ప్రక్కన ఉన్నది. దీని ప్రక్కన ఒక వాగు ఏడాదికి 7,8 మాసాలు పారుతుంటుంది. చిన్న పల్లె ఐనా గౌరీపురం పచ్చని చెట్లతో, అమాయకులైన కర్షకులతో, స్వచ్ఛమైన గాలితో రమణీయంగా ఉంటుంది. బాటసారి పల్లె కావటం చేత చింతామణి స్వాములు ఒక సత్రం కట్టించి బాటసారి జనానికి వసతి భోజన సౌకర్యాలు కల్పించారు. పీఠాధిపత్యం, గ్రామ వ్యవహారాల వంటి బంధాల్లో చిక్కుకోవటం స్వామికి ఇష్టం కావు. ఐనా అక్కడి భక్తులు, పండితులు, పెద్దల నిర్బంధం మూలంగా స్వామికి అభారం తప్పలేదు. స్వామి సన్నిధికి దూరదూరాల నుండి భక్తులు, రోగులు, సంతాన హీనులు, కష్టాల్లో ఉన్న రైతులు, జిజ్ఞాసువులు వచ్చి వారి మంత్రౌషధీ మహిమలతోను, బోధలతోను శాంత చిత్తులై తిరిగి పోయేవారు. ఈ విధంగా స్వామివారు చింతామణీ పీఠానికి చాలా కాలం అధిపతిగా ఉన్నారు. ఈ కాలంలో గూడవారు

హైదరాబాదుకు వచ్చేవారు. తమ శిష్యుల్లో పరమ సాత్త్వికుడు, గురుభక్తి పరాయణుడు, నియమశీలుడు ఐన తిరుమల రాయనికి త్ర్యంబకచింతామణి అనే దీక్షానామం ప్రసాదించి పీఠాధిపత్యం అప్పగించి స్వామివారు తమ భారం తొలగించుకున్నారు. మరానికి శిష్యులైన వారందరు ఆ బాల చింతామణికి విధేయులై సేవలు చేయవలెనని స్వామి ఆజ్ఞాపించినారు.

స్వామివారు (1907) ప్లవంగ సంవత్సరం కడపటి శరన్నవరాత్ర్యుత్సవాలు గౌరీపురం చింతామణి పీఠంలోనే నిర్వహించి హైదరాబాదుకు వచ్చినారు. శిష్యులకు భక్తులకు నయనానందం కలిగించినారు. స్వామి త్రికాలజ్ఞులు, పరకాయ ప్రవేశ మణిమంత్రౌషధీ గమనాగమన సిద్ధులు. ఐనా ఆ శక్తులను తమకోసం వాడుకో.. ఋషభునివలె శా.శ. 1829 ప్లవంగ సంవత్సరం కార్తీక బహుళ దశమి శనివారం నాడు 30.11.1907 పగలు 12 గంటలకు తమ దేహం చాలించినారు. మోతీసింగ్ గల్లీలోని సమ్మెట కృష్ణయ్య నాయుడు ఇంటికి ఆనుకొని ఉన్న నాయుడుగారి విశాలావరణంలో విధివిధానోక్తంగా స్వామివారి శరీరాన్ని సమాధి చేసినారు. అటు తరువాత సమాధి మందిరం, శ్రీరామ మందిరం, పెద్ద సత్రం, మఠం కట్టించినారు. శరీరం చాలించేనాటికి స్వామివారి వయస్సు 119 ఏండ్ల నాలుగు మాసాలు.

స్వామివారి వర్తమానం తెలిపే చిన్న పుస్తకం శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాథ జీవిత చరిత్ర స్వామివారి శిష్యులు కొక్కిరేణి నరసింహారావు మొదలైనవారు రచించారు. స్వామివారి ప్రథమ శిష్యుడు మఠం, సత్రం నిర్మాత సమ్మెట కృష్ణయ్య నాయుడు 1946లో ప్రకటించినాడు. ఉపోద్ఘాతంలో మాత్రమే స్వామివారి చరిత్రం సంగ్రహంగాఉన్నది. మిగతా 107 పుటలు స్వామివారిపై స్తోత్రాలు తెలుగు సంస్కృత భాషల్లో ఉన్నవి. ఉపోద్ఘాతం చివరన రాక్షస సంవత్సరం చైత్ర మాసం అని ఉండటం చేత 1915లో ఈ గ్రంథం ప్రథమ ముద్రణ జరిగి ఉంటుంది. ఇందులో 23 శీర్షికలతో వివిధ భక్తకవులు తెలుగు సంస్కృతాల్లో రచించిన స్తుతులు, అష్టకములు, పంచరత్నాలు, నక్షత్రమాలికలు, హారతులు, బంధకవిత్వాలున్నవి. చిట్టచివరన 24 శీర్షిక తత్త్వ బోధ ప్రకరణం. పరమహంస పరివ్రాజకాచార్య శ్రీవాసుదేవేంద్రకృతం సంస్కృత మూలం దానికి తెలుగు అనువాదం వచనంలో ఉన్నది. 23 శీర్షికల రచయితల పేర్లు లేవు.

ఉద్భటారాధ్యుల శంకరకవి, భారద్వాజ భీమసేనులు, కొక్కిరేణి నరసింహారావు, స్కందపురీ కుమారార్యుడు, గార్లదిన్నె సుబ్బరాయుడు, మునగాల వెంకయ్య, వనం నరసింహయ్య వంటి 7 పేర్లు మాత్రమే తెలియవస్తున్నవి.

సమాధిపైన, ఈ పుస్తకంలోను ఉన్న స్వామివారి బొమ్మ ఒకే తీరువి. బ్రహ్మతేజం విరజిమ్మే విశాల ఫాలంపై భస్మరేఖలు పెద్ద కుంకుమ బొట్టు, దృఢమైన కాయం, చెవులకు కుండలాలు, చెవి పోగు, మెడలో రుద్రాక్షతావళం, వ్రేలికి ఉంగరం, నల్లటి శిఖ, దట్టమైన మీసాలు, కాశ్మీర శాలువతో ఉన్న ఈ బొమ్మ, స్వామి పీఠాధిపత్యం స్వీకరించిన తరువాతిదై ఉంటుంది. స్వామివారి అష్టోత్తర శతనామావళిలో కృష్ణదాసాది పోషకాయనమః, కామేశ్వర మనోహారిణే నమః, నారసింహమనోరథాయనమః అనీ, నక్షత్రమాలాస్తవంలో ॥ వెంకట సుబ్బాఖ్య విజ్ఞాన రత్నము వలె నీదు మహిమను తెలియనైతి, శ్రీరామ నామధీ శ్రేష్ఠుని తెఱుగుననే ద్రవ్యముల దెచ్చి ఈయనైతి, నరయ నహోబళాహ్వయ సుకృతాత్మున కుద్దియై యాతిధ్య మొనగనైతి, కృష్ణయాభిఖ్యభక్తి సముద్రుని విధంబు నిలిచి యెల్లప్పుడు గొలువనైతి" అని ఉండటంచేత వీళ్ళంతా స్వామివారి భక్తులో శిష్యులో ఐయుండవచ్చును. అష్టోత్తర శతనామావళిలో "గాంధర్వ విద్యానిపుణాయనమః, చంపకాసుమనాసికాయనమః, చంచరీకనిభ స్మశ్రవేనమః, కుండలీ భేదన పటవేనమః, సాంఖ్యయోగసమర్థశ్రియేనమః, లంబికా యోగ లక్ష్యాత్మనే నమః" అనీ పంచరత్నాల పద్యంలో "మంత్రయోగంబున మహియందు వీరికి సముడైన పుణ్య భాస్కరుడులేడు, హఠలయరాజయోగాదుల వీరికి తులనొందు సాధకబలుడు లేడు, జ్ఞానయోగంబున గణుతింప వీరికి సరినొందు సాధువెచ్చటను లేడు, భక్తి వైరాగ్య సంపత్తిని వీరితో తూగెడు యోగి యా జగతి లేడు' అనే మాటలు స్వామివారి వ్యక్తిత్వాన్ని, సంగీత కళావైశారద్యాన్ని, వివిధ యోగముల్లోను, జ్ఞానంలోను వారి సామర్థ్యాన్ని చాటుతున్నాయి.

శ్రీ సచ్చిదానందుల గొప్పతనం తెలిపే ఒక విషయం ప్రస్తావిస్తాను. 90 ఏండ్ల వయోవృద్ధులు, భక్తి జ్ఞానముల పండు, దత్తాత్రేయో పాసకులు, ఒకప్పుడు ఆలిండియా షిర్డీ బాబా సమాజం అధ్యక్షులు, శ్రీమాన్ ఎమ్. రంగాచార్యులవారు ఈ శతాబ్దం తొలిపాదంలో సచ్చిదానంద మఠమున్న మోతీసింగ్ గల్లీలో ఉండేవారు. అప్పుడు ఆమఠానికి వచ్చి పోయే సాధు సంతులను, సిద్ధ పురుషులను, యోగులను ఆచార్యుల వారు దర్శించినారు. ఆచార్యులవారు ఆ కాలంలో యూరోపియన్ పాఠశాలల ఇన్స్పెక్టరుగా

నిజాం ప్రభుత్వం కొలువులో ఉండేవారు. భారత త్రివిష్టప సరిహద్దుల్లో శంభునాథ్ మహారాజనే గొప్ప యోగి తపస్సు చేస్తుండేవారు. భారతదేశ ప్రథమ ప్రధానమంత్రి జవహర్ లాల్ నెహ్రూగారికి ఈ యోగి పితృవ్యసోదరుడు. ఆయన కొంత కాలం కలెక్టరుగా పనిచేసి తరువాత విరాగియై గొప్ప హిమాలయ యోగిగా పేరొందినాడు. ఆ యోగి 1936లో రాజా కిషన్ ప్రసాదు వెంట శ్రీ సచ్చిదానందుల సమాధిని దర్శించి వారి కమండలమును, పాదుకలను కనుల కద్దుకున్నారు. కిషన్ ప్రసాదుగారి కారు ఆ సందులోనికి పోదు కనుక దానిని బడీచావడీ ముందు వదలి ఇరువురూ పాద చారులై మఠానికి వెళ్ళినారు. ఇంతటి మహాయోగి వచ్చినాడనీ ఆ సందులో ఉండేవారంతా మూగినారు. మఠం ఎదురుగా నివాసముంటున్న శ్యామాపంతుల గోపాలరావు, మూగ చెవిటి చిన్న కొడుకును వెంట బెట్టుకొని వచ్చినారు. ఆ శిశువును అనుగ్రహించవలసిందిగా యోగిని ప్రార్థిస్తే ఆయన వినలేదు. రాజా కిషన్ ప్రసాదు బతిమిలాడితే ఆ యోగి, శిశువు నాల్కపై 'ఓం' వ్రాస్తూ 30 సార్లు ఓంకారం చేసినాడు. ఆ శిశువు 'ఓం' కారం చేసినారు. ఈ అద్భుతం చూచినవారందరూ యోగి చుట్టు మూగినారు. అందులో శ్రీమాన్ రంగా చార్యులవారొకరు. జనసమ్మర్దానికి తట్టుకోలేక యోగి అదృశ్యులైపోయినారు. రాజా కిషన్ ప్రసాదు ఆశ్చర్య చకితులై తమ కారు వద్దకు పోతే అందులో ఆ యోగి రాజున్నారు. ఇరువురూ కలిసి అక్కడినుండి వెళ్ళి పోయినారు. అంతటి యోగిరాజు శ్రీ సచ్చిదానందుల సమాధి దర్శనానికి వచ్చినారంటే శ్రీ సచ్చిదానందు లెంతటి మహాత్ములో మనం ఊహించుకోవచ్చు. శ్రీమాన్ రంగాచార్యులవారు, మరునాడు శ్రీశంభునాథ్ మహారాజుగారిని రాజా కిషన్ ప్రసాద్ దేవిడిలోను, రెండేండ్ల తరువాత హంపి సమీపంలో నున్న గుట్టపైన మరల దర్శించినారు. రంగాచార్యులవారు ఆ యోగి రాజును దర్శించి నప్పటి విశేషాలు అద్భుతాలు, మరొకసారి మనవి చేస్తాను. శ్రీ శంభునాథ్ మహారాజుగారి చిత్రపటమూ, మరికొందరు మహాత్ముల పటాలు సచ్చిదానంద మఠం సమాధి మందిరంలో ఇప్పటికీ ఉన్నవి.

సచ్చిదానందమఠంలో చైత్రమాసంలో శ్రీ రామకల్యాణోత్సవం ఆశ్వీజమాసంలో శరన్నవరాత్ర్యుత్సవాలు, కార్తీక బహుళదశమి నాడు స్వామివారి ఆరాధనోత్సవాలు ఇప్పటికీ జరుగుతున్నవి. ఆ మఠానికి సమ్మెట కృష్ణయ్య నాయుడు తొలి ధర్మకర్త. ఆయన తరువాత ఆయన కొడుకు సమ్మెట గురు ప్రసాద నాయుడు 1960 దాక ధర్మకర్త. ప్రస్తుతం గురుప్రసాద నాయుడు కొడుకు వెంకట కృష్ణయ్యనాయుడు ధర్మకర్త.

ఆధారాలు : 1) శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాథ జీవితచరిత్ర - 1946
2) శ్రీమాన్ ఎమ్. రంగాచార్యులవారితో ముఖాముఖి - 1996

# శ్రీవల్లభ చరితామృతము

మూలం :
**శ్రీ కళాధరభట్**

అనువాదం :
**డా॥ తిరుమల రామచంద్ర**

*(గత సంచిక తరువాయి)*

## బ్రహ్మ సంబంధం లేక సేవామార్గానికి అధికారం లేదు

బ్రహ్మ సంబంధం స్వీకరిస్తేనే గాని పుష్టి మార్గీయ 'సేవ' చేయడానికి అధికారంలేదు. 'పుష్టిమార్గమే అంగికార భయే బినా భగవద్-సేవాకో అధికార్ నహీహో (ని.వా.పుది.3) (పుష్టిమార్గంలో అంగీకారం లేనిదే భగవత్సేవకు అధికారం లేదు) ఈ సంప్రదాయ ప్రణాళికను అనుసరించి 'బ్రహ్మ సంబంధం' సంస్కారం పొందినప్పుడే పుష్టిమార్గంలో ప్రవేశం లభిస్తుంది.

భగవంతుడు తన 'క్రీడ' కోసం ఈ సృష్టిచేశాడు. 'క్రీడార్థ మాత్మాన మిదం త్రిజగత్ కృతంతే' భాగ. భగవంతుడు తన క్రీడ కోసం తన అంశభూతులైన స్వస్వరూప జీవులను 'అగ్ని విస్ఫులింగవత్' తన నుంచే వెలువరించాడు. భగవంతుడు సచ్చిదానందమయుడు, సద్ అంశతో జగత్తును, చిత్ అంశతో జీవుణ్ని సృష్టించాడు. జీవునిలో ఆనందాంశం మరుగై వుంటుంది. జీవుడు కూడా భగవంతుని వలె, షడ్గుణోపేతుడేకాని, అవిద్యతో ఉత్పన్నమైన 'అహమ్' మారినే 'మమ-మూలక' మైన అహంకారం వల్ల ఐశ్వర్యాది గుణాలు అతని నుంచి మరుగయిపోతాయి. 'అస్యజీవస్య ఐశ్వర్యాది తిరోహితమ్।తత్రహేతుః అభిధ్యానాత్- బ్రహ్మసూత్ర అణుభాష్యమ్. ఐశ్వర్య వీర్య యశస్సులు మరుగైపోవడం వల్ల బంధం, జ్ఞానాభావం వల్ల అహంత్వం వైరాగ్యం లేని దాని వలన విషయాసక్తి జీవునిలో చోటుచేసుకొంటాయి. ఈ కారణం వల్ల వల్లభులు జీవుణ్ని స్వభావతః దోషసహితుడని అన్నారు. 'జీవాస్స్వభావతోదుష్టాః'సుబోధిని. ఈ విధంగా జీవుడు భగవదంశ అవుతున్నా దోషసహితుడు, సీమాసమితుడు, అపూర్ణుడు, అధముడు, దుఃఖమయుడు అవుతున్నాడు. భగవంతుడు నిర్దోషపూర్ణగుణ విగ్రహుడు, నిస్సీముడు, సంపూర్ణుడు అనవచ్చును. నిరవధికానందమయుడు అయివున్నాడు. యోవైభూమాతన్సుఖమ్'- ఇటువంటి జీవుని ఉద్ధారానికి ఏకైక ఉపాయం భగవత్సన్నిధిని

పొందడం. కాని, ఇది ఎలా కలుగుతుంది? సకల దోష నిధానమూ, అపూర్ణుడూ అయిన పురుషాధమునిపట్ల సకలగుణనిధానమూ, పూర్ణుడూ అయిన పురుషోత్తముని ప్రీతి ఎలా కలిగించాలి?

జీవుడు ప్రపంచాన్ని పూర్తిగా మరిచిపోయిభగవంతుని యందు అనన్యమైన ఆసక్తి పొందినప్పుడు అతని ఉద్ధారం జరుగుతుంది. వాస్తవానికి ప్రపంచ విస్మృతేభగవదాసక్తి- 'ప్రపంచ విస్మృతిః భగవదాసక్తిః' సుబోధిని. నిష్కపటమూ, అనన్యమూ అయిన భగవత్సేవలోనే అట్టి స్థితిని పొందడం సాధ్యమౌతుంది. ప్రపంచాన్ని విస్మరించడం వల్ల బంధనివృత్తి కలుగుతుంది. - 'ప్రపంచ విస్మృతిర్ముక్తి' - సుబోధిని. బంధనివృత్తి వల్ల భగవంతుని యందు సహజంగానే ఆసక్తి ఉద్భవిస్తుంది. భగవదాసక్తే నిరోధం. ఆ విధంగా 'నిరోధమే' మహాఫలం. 'నిరోధ మహాఫలాః' సుబోధిని.

జీవుడు భగవంతుని నిష్కపటమైన అనన్యమైనసేవలో తత్పరుడైనప్పుడే ఇదంతా సాధ్యం. అయితే, భగవంతుడు సంపూర్ణంగా నిర్దోషుడైన జీవుణ్ణే తన సేవకు అంగీకరిస్తాడు. పూర్తిగా దోషరహితుడైన జీవుని ద్వారానే భగవంతుడు సౌమ్యుడుగా, వ్యవహృతుడయాడు - ముక్తోపసృప్య బ్రహ్మసూత్రం. దోషరహితుడినే భగవంతుడు తన సేవకు స్వీకరిస్తాడు. 'నిర్దుష్టంహి భగవాన్ గృహ్ణాతి'- సుబోధిని. దోష సహిత వస్తువులను భగవంతుడు ఎప్పుడూ స్వీకరించడు-'నావి నిందితా వార్మన్ భగవాన్పరిగృహ్ణాతి' సుబోధిని. భగవంతుని సేవను శుద్ధ జీవుడే చేయగలడు. 'శుద్ధైదేవ భగవత్సేవా కర్తుం శక్యతే" - సుబో. భగవత్ప్రీ సంపాదనకు యోగ్యత అవసరం. దోషరహితుడైన జీవుడే భగవంతునికి యోగ్యుడవుతాడు. 'భగవత్ప్రీతౌ స్వరూప యోగ్యత్వా ఏక్ష్యతే' - సుబో.

ఈ విధంగా దోష సహితుడైన జీవుని సేవను భగవంతుడు అంగీకరించకపోతే, సేవాఫలం లభించనందున, ఉపదేశం పొందినంతమాత్రాన భక్తి మార్గం ఆ జీవునికి ఎప్పుడూ ఫలించదు. భగవంతుని నుంచి విడిపోయి, అందువలననే భగవద్విరహానలంతో సంతప్తులైన జీవులను ఉద్ధరించడానికి వారికి భగవంతుని ముఖకమల సేవను కలిగించడానికి గానే వల్లభులు భగవంతుని సాక్షాన్ముఖ కమల స్వరూపులై అవతరించారు.

జీవులను దోషాల నుంచి సంపూర్ణంగా విముక్తులను చేసే ఉపాయాన్ని సాక్షాత్పూర్ణ పురుషోత్తముడు జీవోద్ధరణ చింతాగ్రస్తులైన ఆచార్యులకు తెలిపారు. 'బ్రహ్మసంబంధం' కలిగించడం వలన సకల జనులకు - దేహ జీవుల - సకల దోషాలు నిస్సందేహంగా తొలగిపోతాయని భగవంతుడు ఆదేశించాడు - 'బ్రహ్మసంబంధ కారణ్యాత్

సర్వేషాం దేవ జీవయోః సర్వదోష నివృత్తిర్హి' - సి.ర.

'బ్రహ్మ సంబంధం' ద్వారా జీవుడు భగవంతునికి సర్వస్వం సమర్పిస్తాడు దీనిని ఆత్మనివేదనమని కూడా అంటారు. జీవుడు ఆత్మనివేదనం ద్వారా తన పరివార సమేతంగా భగవంతునివాడయిపోతాడు. ఆత్మనివేదన మంటే, జగత్తులోని పదార్థాల ఎడల 'నేను, నాది' అనే అభిమానాన్ని త్యజించి, అవి భగవదీయం కావాలనే విజ్ఞాపన. దేహేంద్రియాలు, ప్రాణం, అంతఃకరణాత్మకమైన 'అహం', దారాపుత్రులు, ఇల్లు, ఆప్తులు, విత్తం, ఐహికపారలౌకికాది 'మమ' అనేది సమస్తమూ భగవంతునికి అర్పితమైనందున భగవదీయాలు - భగవంతునివి అయిపోతాయి. దీనిలో ఆత్మసమర్పణం ముఖ్యం. 'హే భగవాన్' ఈ 'నేను', 'నాది' అనే సకల పదార్థ సమూహమూ నీవే కదా! వీటిని తెచ్చాను. స్వీకరించు'. ఇదే నివేదనకు - అర్పణకు అర్థం. 'నివేదనం తవేదమనీతం గృహాణ' - సుబోధిని. నిజానికి జీవుల ఉత్పత్తి భగవత్సేవ కోసమే జరిగింది. కాని, సంసారగత మాయా ప్రభావం వల్ల వారి ఆచరణ వ్యత్యస్తమైంది. అయినప్పటికీ "హే కృష్ణ! నేను మీ వాడినే' అని విజ్ఞాపనం చేస్తే భగవంతుడు వారిని సర్వభయాల నుంచి విముక్తులను చేస్తాడు - 'భగవత్సేవార్థంహి ఉత్పాద్యంతే సంసార మాయయా విపరీతా ఏవ భవంతి, తథాపి . 'కృష్ణతవాస్మి 'ఇత్యుక్తః సర్వమేవ భయందూరీ కరోతి' - సుబోధిని భగవంతుని కోసం ఉత్పన్నమైన ఈ జగత్తును జీవుడు తన అహం, మమ అనే బుద్ధితో తనదని భావిస్తాడు. ఇలా భావించడం వల్ల భగవద్విరోధ మవుతుంది. అందువల్ల అతనికి బంధం ఏర్పడుతుంది - 'భగవదర్థేకృతే జగతి స్వస్యాహంతా మమతాయాం భగవద్విరోధేన బంధః స్యాత్' - సుబో'. జగతి సంబంధం వల్ల వస్తుతః జీవుడు బంధవిముక్తుడై దోషరహితుడవుతాడు. జగత్తులోని సకల పదార్థాలు బ్రహ్మస్వరూపాలు. అందువల్ల వాటిలో భగవదీయత్వ భావనను అనుసంధానం చేస్తే, ఆ వస్తువుల స్వరూపమైన ప్రకృతి గుణాలతో ఏర్పడిన దోషాలు నివృత్తి కావడ మనేది మనస్తత్వ శాస్త్రానికి సంబంధించిన సహజమైన వాస్తవం. శ్రీ పురుషోత్తములు 'సిద్ధాంత రహస్యం' అనే గ్రంథం రెండవ శ్లోకం 'వివరణ'లో ఈ భావాన్నే స్పష్టం చేశారు. 'వస్తుతః' సర్వస్య బ్రహ్మ రూపత్వాత్ తత్ర భగవదీయత్వే అనుసంహితే తదుప దేహ భూత ప్రాకృత గుణ జన్యస్య దోషస్య నివృత్తిర్భవతి'.

(సశేషం)

# అనుభవతరంగిణి

- శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

(గత సంచిక తరువాయి)

గుంటూరులో టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో పని చేస్తున్న శ్రీ పాలేటి శివాజిరావు 1988 వ సంవత్సరంలో - హనుమజ్జయంతి ఉత్సవాల్లో - మాస్టరుగారిని ప్రప్రథమంగా దర్శించి పాదనమస్కారం చేసుకున్నారు. ఆ తర్వాత రెండు నెలల వరకూ మాస్టరుగారి దగ్గరకు పోలేదు. ఒకరోజు మాస్టరుగారు అతనికి కలలో కనిపించారు. మిలటరీ కటింగ్‌తో ఉన్న జుట్టు ... సన్నటి మీసం. వేషమంతా కొత్తకొత్తగా ఉంది. ఆయన వస్తూనే "రా! పోదాం!' ' అన్నారు. ఆ వచ్చిందెవరో అతనికి అర్థం కాలేదు. తెల్లవారింది. మరి రెండురోజుల తర్వాత స్వప్నంలో మాస్టరుగారు కనిపించారు ... మామూలు రూపంలో. "రా! పోదాం!' ' అన్నారు. ఛప్పున కళ్లు తెరిచాడు. అతని కిక నిద్ర పట్టలేదు - ఆ రాత్రి. మాస్టరుగారి దగ్గరకు ఎప్పుడు పోదాం? అనే ఆలోచనలో పడ్డాడు. మూడు రోజులు గడిచాయి. "మంచి రోజు చూచుకుని పోదాం" అనుకున్నాడు. ఆ రోజు రాత్రి మళ్ళీ మాస్టరుగారు కనిపించి "రా! పోదాం!" అన్నారు. ఆయనతో బయలుదేరాడు శివాజీరావు. కొంత దూరం పోయిం తర్వాత ఒక గణేశ విగ్రహం కనిపించింది - రోడ్డు ప్రక్కన. మాస్టరుగారు అక్కడ ఆగి, శివాజీరావు చేతికి అక్షత లిచ్చి "విగ్రహం మీద వేసి, నమస్కారం చెయ్"అన్నారు. అలాగే చేశాడు. కల చెదరిపోయింది.

తర్వాత ఒక నెలకి ఎవరో చుట్టాలు వాళ్ళ ఇంటికి వచ్చారు. వాళ్ళు తమతో ఒక మల్లెపూదండ తెచ్చారు. మాస్టరుగారి దగ్గరకు పోదామని. ఎందుకో వాళ్ళకు పోవడానికి వీలు చిక్కక, శివాజీరావు చేతికి ఆ దండ యిచ్చి 'మాస్టరుగారికి ఇచ్చి రా?'అన్నారు. మాస్టరుగారి దగ్గరకు పోవడానికి అతను తటపటాయిస్తుంటే, వాళ్ళు పోయి రమ్మని బలవంతం చేశారు. ఇక అతనికి బయలు దేరక తప్పలేదు. బెరుకుబెరుగ్గా రైలుపేట - మాస్టరుగారి గదికి - వచ్చాడు. మాస్టరుగారప్పుడు గదిలో లేరు. ఎక్కడికో వెళ్ళారు. అతను వరండాలో కూచోని మాస్టరుగారి కోసం ఎదురు చూడటం మొదలుపెట్టాడు. కాసేపటికి మాస్టరుగారు వచ్చారు. శివాజీరావు లేచి, ఎదురుగా వెళ్ళి నమస్కారం చేశాడు. మాస్టరుగారు అతని చెయ్యి పట్టుకొని, ముద్దు పెట్టుకుని "రా! పోదాం!" అని తమ గదిలోకి తీసుకు వెళ్ళారు. అక్కడ మాస్టరుగారు పూజ చేశారు. పూజానంతరం అతను తన

చేతిలోని పొట్లాం విప్పుతుంటే "ఏమిటి?" అన్నారు మాస్టరుగారు. "దండ" అన్నాడు శివాజీరావు. మాస్టరుగారు ఆ దండను చేతిలోకి తీసుకొంటూ "ఎక్కడో చూచినట్లుందే ఈ దండ" అన్నారు. "ఇదే ఫస్టు టైం" అన్నాడు శివాజీరావు. ఆ దండను షిర్డీ సాయినాధుని విగ్రహానికి వెయ్యమంటే అతడు వేశాడు. ఇది మాస్టరుగారితో అతని తొలి పరిచయం.

ఆ తర్వాత చాలాసార్లు మాస్టరుగారి గదికి అతను వెళ్ళాడు. ఒకసారి అతడు ఒక డజను అరటిపండ్లు మాస్టరుగారికి సమర్పించాడు. మాస్టరుగారు అతని చేతిలో అక్షతలు పెట్టారు. ఆ అక్షతలు లెక్కబెడితే పన్నెండు ఉన్నాయి. ఈ చిత్ర మేమిటో చూద్దామని మరునటిరోజు పదకొండు అరటిపండ్లు తీసుకుపోయి మాస్టరుగారి కిచ్చాడు. మాస్టరుగారు అతని చేతిలో అక్షతలు పెట్టారు. లెక్క బెడితే ఆ అక్షతలు పదకొండు ఉన్నవి. తొమ్మిది పండ్లిస్తే అక్షతలు తొమ్మిది ఉన్నాయి. ఇది శివాజీరావుకు చాలా ఆశ్చర్యం కలిగించింది. "మాస్టరుగారు సామాన్యులు కారు. మహాత్మ" లనిపించింది. "యోగ్యతను బట్టే యోగం లభిస్తుం"దని అక్షతల ద్వారా తనకు మాస్టరుగారు చెబుతున్నారని అతనికి అనిపించింది. అనన్యమైన భక్తిభావంతో మాస్టరుగారి మీద చాలా పాటలు వ్రాశాడు. వాటిని మాస్టరుగారి సమక్షంలో అతడు పాడుతుంటాడు. మాస్టరుగారు కూడా అప్పుడప్పుడు అతని చేత పాటలు పాడించుకొని, విని ఆనందిస్తూంటారు. "స్వామి సన్నిధే నాకు పెన్నిధి" అని భావిస్తుంటాడు శివాజీరావు

(సశేషం)

# నీ వెవరు ? నీ ధర్మ మేది ?

**- శ్రీ బ్రహ్మానంద భారతి స్వామి**

ఆనందము తనలోనే యున్నదని వివరించితిమి. ఇక తానెవరో, యెచ్చట నున్నాడో యే రూపముతో నున్నాడో విచారింతము. ప్రతి మానవునిన్ని నీ వెవరని ప్రశ్నించినచో కర చరణాది ఇంద్రియములతో కూడిన శరీరమే నే ననియు, నేను ఫలానా తలిదండ్రులకు పుట్టినవాడనియు, నాది ఫలానా దేశము, రాష్ట్రము, జిల్లా, ఫలానా గ్రామము అనియు, నేను ఫలానా జాతి, ఫలనా మతస్థుడననియు, నా కుల గోత్రము లివి యనియు, నేను పురుషుడు, నేను స్త్రీ యనియు, నా కులాచార వ్యవహారము లివి యనియు వచించును. కాని సూక్ష్మ బుద్ధితో దీర్ఘముగా నాలోచించినచో ఇవి యంతయు కల్ల. ఈ శరీరము అశాశ్వతము. జరామరణ వ్యాధులతో గూడినది. దీనికి బాల్యము, యౌవ్వనము, కౌమారము, వార్థక్యము, మరణము అను అవస్థలు గలవు. జాయతే, వర్ధతే, పరిణమితే, అపక్షీయతే, వినశ్యతే. అనగా పుట్టుట పెరుగుట ఉండుట, కృశించుట, నశించుట అను పంచ పరిణామములు గలదీ శరీరము. మరణించిన పిమ్మట తానేమగునో యని తన సంగతి తనకే తెలియదు. మరణించిన పిమ్మట పీనుగయై భూపతన మగుచున్నది. విజ్ఞాన వంతుడైన ప్రతి మానవుడున్ను అజ్ఞానముచే పీనుగయే తానని భ్రమించి దేహ సుఖములకే పాటుబడుచు తన్ను తాను మరచి జనన మరణాది నరక కూపమున బడి బాధపడుచున్నాడు.

ఇక తానెవరనగా ప్రతి మానవుడున్ను నా తల్లి, నా తండ్రి, నా సతి, నా సుతులు, నా బంధువులు, నా మిత్రులు, నా ధనము, నా ధాన్యము, నా గృహము, నా భూములు, నాతోటలు అని చెప్పునప్పుడు వాటి కన్నిటికీ వేరుగా యుండి చూచుచు అవి నావి యని అనుచున్నాడు. ఆ కనబడే వన్నియు దృశ్యములు. తాను చూచే చూపు దృక్కు అయినవి. ఈ ద్రష్ట, దృక్కు, దృశ్యములను త్రిపుటి యందురు.

అదేవిధముగా ప్రతి మానవుడున్ను నా శరీరము, నా యింద్రియములు అని ఈ దేహమునకు, దేహేంద్రియముల కన్నా వేరుగా నుండి అవి నావి అని తెలుపుచున్నాడని మన కందరికిన్ని అర్థమగుచున్నది. ఇక తా నెచ్చటనుండి ఈ దేహేంద్రియాదులను చూచుచున్నాడో కొంత విచారింతము. నా దేహము అనునపుడు ఈ దేహములో యెచ్చట యుండి చెప్పుచున్నాడు? నా కాలు, నా చెయ్యి, నా తల, నా కన్ను, నా చెవి, నా పొట్ట,

నా గుండె అని వీటి కన్నిటికి వేరుగా నుండి చెప్పుచున్నాడు.

ఇక ఈ దేహేంద్రియము లన్నిటికీ రాజు మనసు. మనసు కన్నా గొప్పది బుద్ధి. వీటన్నిటిని నా మనసు, నా బుద్ధి యని చెప్పుచు బుద్ధి కిన్ని సాక్షిగా యున్నాడు మరియు ప్రాణవాయువు ఉన్నంతవరకే దీనిని శరీర మందురు. అది దేహము నుండి వెళ్ళిన పిమ్మట దీనిని పీనుగ యందురు. ఆ ప్రాణవాయువును సహితము నా ప్రాణము అనుచున్నారు. ఆ ప్రాణమునకు వేరుగానే యున్నాడు. ఈ దేహేంద్రియ ప్రాణాదు లన్నిటికి శక్తిని కలిగించి అన్నిటిని నడిపించువాడు జీవుడు. ఈ జీవుడు చైతన్య స్వరూపుడు. కాని అట్టి జీవుని కూడా నా జీవుడు అనుచున్నాడు. ఈ జీవుడు ప్రత్యగాత్మ యొక్క ప్రతిబింబము ఆ ప్రత్యగాత్మను కూడా నా యాత్మ అనుచున్నాడు. కావున ఆత్మకున్ను అతీతమై సర్వమును తెలుసుకొను పరమాత్మయే నీవు. దేహేంద్రియము లన్నిటికిన్ని మనసు సాక్షిగా యున్నది. మనసుకు బుద్ధికి జీవుడు సాక్షిగా యున్నాడు. జీవునకు ప్రత్యగాత్మ సాక్షిగా యున్నాడు. ప్రత్యగాత్మకు పరమాత్మ సాక్షిగా నున్నాడు. ఆ పరమాత్మయే నీవని గ్రహింపవలెను. ఇట్లు సర్వసాక్షియైన పరమాత్మ తానై యుండియు జడస్వరూపమైన ఈ దేహమే నేనని భ్రమించి నేను ధనికుడను, నేను దరిద్రుడను, నేను పాపాత్ముడను. నేను పామరుడను, నేను పండితుడను, నేను జ్ఞానిని, నేను అజ్ఞానిని అను పలు విధములుగా నుడువుచు దుఃఖితుడగుచున్నాడు. దేహమే తానని భ్రమించుటే మహాపాపము. తాను పరమాత్మ యని తెలుసుకొంటిమి. ఇక ఆ పరమాత్మ పురుషుడా ? లేక స్త్రీయా ? అని మరికొంత సూక్ష్మముగా నాలోచించినచో తాను పురుషుడే. యెట్లనగా వృక్షములలో నున్నవాడు జీవుడు. పక్షులు జంతువులలో నున్నవాడు జీవుడే. మానవులలో నున్నవాడు జీవుడే. స్త్రీలలో నున్నవాడు జీవుడే. పురుషులలో నున్నవాడు జీవుడే. సృష్టి కర్త పిండాండ సృష్టి కొఱకు కొన్ని అవయవ భేదములచే స్త్రీ పురుషులుగా సృష్టించెను. కాని రూప నామములు గల ప్రతి యొక్క రూపములో నున్నవాడు జీవుడే.

ఒక స్త్రీ చనిపోయిన పిమ్మట ఆమె జీవుడు చాలా పరితపించినాడు. ఆమె జీవుడు వెళ్లిపోయినాడని యందురు. శరీరము నేమో ఆమె అందురు. ఆ శరీరములో నున్న చైతన్య స్వరూపుని జీవు డందురు. జీవుడు అను పదము పుంలింగమే గనుక తాను (పరమాత్మ) పురుషుడే యని నిశ్చయింపబడినది. ఇక ఆ పురుషుడు (తాను) యే రూపముతో నున్నాడో యని కొంత విచారింతము.

వేదము భగవంతుడు పురుషుడే యని నిశ్చయించి ఆ పురుషుని యొక్క

రూపమును క్రిందివిధముగా వర్ణించినది.

శ్రుతి : సహస్ర శీర్షా । పురుషః । సహస్రాక్షాత్సహస్రపాత్ ।

సభూమిం విశ్వతోవృత్వా । అత్యతిష్ఠద్దశాంగులం ॥ - పురుష సూక్తము

తాత్పర్యము : వేయి శిరస్సులు, వేయి నేత్రములు, వేయి పాదములు గలవాడు పురుషుడు అట్టి పురుషుడు ప్రతి మానవునికి పది అంగుళముల దూరమున ప్రకాశించుచున్నాడు.

ఈ పురుషునకు వేయి శిరస్సులు,వేయి నేత్రములు, వేయి పాదములు కలవని వేదము తెలిపినది. కాని ఇట్టి విచిత్ర పురుషు డెచ్చట గలడు ? వేయి శిరస్సులు గలవాడు ఆదిశేషుడనియు, తన పడగపై భూమిని మోసుకొని యున్నాడని పురాణములు చాటుచున్నవి. కాని సకల జీవ సముదాయమున కాధారమై సకల జీవులను తాను మోసుకొని యున్నదీ భూమి. ఈ భూమండలము నంతటిని తన పడగపై నుంచుకొని మోయుచున్న ఆదిశేషునికి ఆధారమేది? మన తలపై ఒక వస్తువును ఉంచుకొని మోయుచున్నామనుకొందము. ఆ వస్తువునకు మన శిరస్సు ఆధారమై యున్నది. మనకు భూమి ఆధారమై యున్నది. ఇట్లు సకల జీవుల కాధారమైన భూమికి ఆది శేషుని శిరస్సు ఆధారము. ఇక ఆదిశేషునికి ఆధార మేది? అతడు దేనిపై నిలుచుకొని ఈ భూమిని మోసుకొని యున్నాడు? అని విచారించగా అంతా అయోమయముగా నున్నది. అంతేగాక ఆదిశేషునకు వేయి శిరస్సులు. ఒక్కొక్క శిరస్సుకు రెండు నేత్రములు.ఇట్లు వేయి శిరస్సులకు రెండు వేల నేత్రములు గలవు. కాని వేదము భగవంతుడిగా పురుషునకు వేయి శిరస్సులు, వేయి నేత్రములు, వేయి పాదములు అని తెలుపుచున్నది.

భగవంతునికి పరంధాముడు అను నామము గలదు. పరమ అనగా గొప్పదైన ధామము అనగా ప్రకాశము అని యర్థము. అనగా భగవంతుడు గొప్ప ప్రకాశమే స్వరూపముగా గలవాడు. ఆ ప్రకాశమును కోటి సూర్యప్రకాశ మనియు, అనంతము, అఖండము, అవ్యయము, అద్వితీయము అని పలువిధములుగా వర్ణించిరి అనుభవజ్ఞులైన యోగి పుంగవులు. దానినే పరబ్రహ్మము అందురు. ఆ పరబ్రహ్మము నిర్గుణ బ్రహ్మము, సగుణ బ్రహ్మము అని ద్వివిధములు.

కోటి సూర్య ప్రకాశవంతుడు, అవాఙ్మానసగోచరుడు అనగా వాక్కుతో వర్ణించుటకుగాని మనసుతో ఊహించుటకుగాని వీలుకాని వాడు. కావున అట్టి భగవంతుని జోలి మాకు కెందుకులే యని మానవులందరూ నాస్తికులై పాపాత్ములై పతనమైపోదురు.

గనుక భగవంతుడు దయాస్వరూపుడై మానవులను కడతేర్చ దలంచి, భక్తులకు దర్శన మిచ్చి వారిని ఆనందమయులుగాను, ముక్తులుగాను చేయుటకై సగుణ రూపమును ధరించెను. ఆ సగుణ పరబ్రహ్మ వేయి శిరస్సులు గల పరంజ్యోతి యగు ప్రత్యగాత్మ, ఆ వేయి కిరణములే ఆ పరమ పురుషునకు వేయి శిరస్సులు. ఆ కిరణములు ప్రకాశవంతములైనవి గనుక అవియే వేయి నేత్రములు. ఆ వేయి కిరణములు (సూర్యకిరణములవలె) క్రిందికి వ్యాపించి, సూర్య చంద్ర నక్షత్రాదులను ఈ భూమితో కూడిన సమస్త విశ్వము నంతటిని ఆవరించి సకల జీవ సముదాయములను ప్రకాశింపజేయుచు, వర్తింపజేయుచున్నది గనుక క్రిందికి వ్యాపించిన ఆ కిరణములు పాదములైనవి. మరియు ఆ వెలుగు సకలేంద్రియములకు ప్రజ్ఞను కలిగించి ప్రపంచ నటన జరిపించుచున్నది. ఆ సగుణ బ్రహ్మమునకు వేయి శిరస్సులు (వేయి కిరణములు) వేయి నేత్రములు (ప్రకాశము) వేయి పాదములు (క్రిందికి వ్యాపించుట) అయినందువలన దానిని సహస్రారమని వచింపబడుచున్నది. అదియే ఆ ప్రత్యగాత్మ. ఆ ప్రత్యగాత్మ సగుణబ్రహ్మము. ఆ ప్రత్యగాత్మకు సాక్షిగా నున్న పరమాత్మయే నీవు.

అత్యతిష్ఠ ద్దశాంగులం - అది పది అంగుళములకు పైన ప్రకాశించుచున్నదనగా పంచభూతముల కతీతముగా సహస్రారమై ప్రకాశించు సగుణబ్రహ్మము. ప్రతి జీవికి 10 అంగుళముల దూరమున యుండి ఇంద్రియములను ఉత్తేజపరచి వృత్తులను చేయించుచున్నది. అందువలననే మన దేవతల చిత్రపటములందు శిరస్సు వెనుక వైపున ఒక మహా వెలుగు ప్రకాశించుచున్నట్లు కనుపించుచున్నది.

మన భౌతిక విజ్ఞాన శాస్త్ర వేత్తలు అనేకమును కనుగొనుచున్నారు. కాని తనలోనే యుండి తన యింద్రియములను ప్రకాశింపజేయు ప్రజ్ఞానమును కనుగొనజాలకున్నారు భౌతిక ప్రయోగముల వలన ఇది కానరాదు. యోగము అను ప్రయోగము వలననే గ్రహింపదగును.

నీవు యెవరు ? అనగా జీవుని యొక్క స్వస్వరూపమైన ప్రత్యగాత్మ.

తను సగుణ స్వరూప మనియు, ఆ ప్రత్యగాత్మకును సాక్షి యున్న (నా ఆత్మ) నివసించు పరమాత్మయే తానని తెలుసుకొంటిమి. ఇక నీ ధర్మ మేది ? అను విషయమును మరో వ్యాసములో తెలుసుకొందము.

# ఓరుగల్లు సాహితీ కళా తపస్వి కన్నుమూత



ప్రముఖ సాహితీవేత్త, కళాతపస్వి, సాంస్కృతిక సేవాదురంధరుడు, రాజకియ చతురుడు, అలనాటి కాకతీయ పత్రికా సంపాదకుడు, మేధావి, బహువిషయ పరిజ్ఞాత, ప్రస్తుత జిల్లా గ్రంధాలయ అధ్యక్షులు, మాజీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారి ఆత్మీయసహచరుడు శ్రీ పాములపర్తి సదాశివరావుగారు గత ఏడాది నుంచి అనారోగ్యంతో బాధపడుతూ ఈ మధ్యనే గొంతు క్యాన్సర్ వ్యాధి ఆలస్యంగా బయల్పడి, చికిత్స పొందుతూ గత 26-8-1996 ఉదయం 5 గంటలకు పరమపదించినారని పాఠకులకు తెలియజేయటానికి చింతిస్తున్నాను.

ఏ రాజకీయాలతో సంబంధం లేక, సాహితీవేత్తగా, కళాసాంస్కృతిక అభిమానిగా, వేద, పౌరాణిక, విజ్ఞాన నిష్ణాతునిగా, చక్కని విమర్శకుడుగా, మార్క్సిజంలాటి అనేక గ్రంధాల నౌపాసన పట్టిన విద్యావేత్తగా, మేధావిగా ఓరుగల్లు నివాసంగా మొత్తం తెలంగాణాకు చిరపరిచితులైన వ్యక్తిగా వీరు రాణించారు. శ్రీ సదాశివరావుగారు ఎన్నో వ్యాసములు, గ్రంధాలు రచించారు. అవి చాలావరకు అముద్రితాలు. వారు విరచించిన తత్వశాస్త్ర భాగాలు ప్రస్తుతం 8,9 తరగతి విద్యార్థుల సాంఘిక శాస్త్రంలో పాఠ్యభాగాలుగా ఉన్నవి. వీరు రచించిన వానిలో ముఖ్యమైనవి తత్వశాస్త్రం, అభ్యుదయగేయాలు, జ్ఞానసిద్ధాంతం, విద్యారంగ సర్వస్వం మొదలైనవి.

1950లో తెలంగాణా సాహితీవేత్తల నందరినీ ఒక వేదికపై తెచ్చే ప్రయత్నంలో నాటి రాజకీయ అరాజక పరిస్థితులను ప్రజలకు విశదం చేసే సంకల్పంతో 'కాకతీయ'

వారపత్రికను ప్రారంభించి సంపాదకత్వం నిర్వహించారు. మాజీ ప్రధాని శ్రీ పి.వి. గారు వీరికి ఎంతో ప్రోత్సాహమిచ్చి పత్రికకు కావలసిన సమస్త హంగులు సమకూర్చి, అందులో సహబాధ్యత స్వీకరించి వ్యాసాలు, రచనలు కూడా సమకూర్చారు. ఇందులో ప్రముఖులు శ్రీ దేవులపల్లి దామోదరరావుగారు, కీ.శే. శ్రీ రాజా నరేంద్ర గారును అహర్నిశలు పాటుపడిరి. ఈ పత్రిక రాష్ట్రంలో అత్యుత్తమ వారపత్రికగా పేరొంది, ఉత్తమ సేవ లందించింది. కాకపోతే అన్ని పత్రికల లాగే ఈ పత్రిక కూడా ఎన్నెన్నో ఒడిదుడుకుల నెదుర్కొని అయిదారు సంవత్సరాల తర్వాత ఆగిపోయింది.

1951 ప్రాంతంలో శ్రీ సదాశివరావుగారు ఓరుగల్లులో 'పౌరసమితి'ని స్థాపించి, స్థానిక మున్సిపల్ యెన్నికల్లో, నిజాయితీపరులను యెంపిక చేసి, ఎన్నికల్లో నిలబెట్టారు. తర్వాత మార్క్సిజం సిద్ధాంతాలకు ప్రభావితులై కొంతకాలం, కమ్యూనిస్టు పార్టీలో పనిచేశారు. 1954 యెన్నికల్లో పార్లమెంటుకు పోటీచేసి ఓడిపోయారు. శ్రీ ఏటుకూరి బలరామమూర్తి, శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, శ్రీ కంభంపాటి సత్యనారాయణ మొదలైన వారితో సన్నిహితంగా మెలగటం వల్ల వీరిని 'థింక్‌టాంకర్స్'గా పిలిచేవారు. అంతకు పూర్వం 1942 ప్రాంతంలో శ్రీ సదాశివరావుగారు 'కాకతీయ కళా సమితి' యేర్పాటు చేసి వరంగల్‌లో నాటకాలు, సంగీత కచేరీలు, త్యాగరాజ ఆరాధనోత్సవాలు నిర్వహించారు. వీరు శ్రీ పి.వి.గారు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, శ్రీ కాళోజీగారు మొదలైనవారి సలహా సంప్రదింపులు పొందేవారు. నాడు ఎందరో కళాకారులను సన్మానించారు.

శ్రీ సదాశివరావుగారికి సన్నిహితులుగా చెప్పబడే మేధావుల్లో శ్రీ పి.వి. గారు, శ్రీ కాళోజీ నారాయణరావుగారు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు, శ్రీ గోరాగారు, శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు, శ్రీ డా॥ బిరుదురాజు రామరాజుగారు, శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావుగారు, మొదలైనవారు ముఖ్యులు. వీరి సలహా సంప్రదింపులతో యెన్నో కార్యక్రమాలు నిర్వహించారు శ్రీ రావుగారు సుమారు 20 సంవత్సరాల క్రితం వరంగల్‌లో "నభూతో నభవిష్యతి" అన్నట్లు 'విద్యారణ్యగోష్ఠి' కార్యక్రమాల్లో శ్రీ సదాశివరావుగారు సారథిగాకున్నా, సచివుడి పాత్ర వహించారని చెప్పక తప్పదు. గత సంవత్సరం డా॥ సంపత్ రాజారాం ఉద్యానవనంలో శ్రీ సదాశివరావుగారు ఉపనిషత్తులు, నైమిశారణ్య బ్రహ్మసూత్రాలు, పౌరాణికాలు మున్నగువానిపై ప్రతి

ఆదివారం ఒకటి చొప్పున దాదాపు 200 లెక్చర్లు ఇచ్చి ఉపనిషత్ సారాన్ని వ్యాఖ్యానించారు. ఓరుగల్లులోని మేధావి వర్గం ఆ ఉపన్యాసాలు విని ముగ్ధులయి వారిని ఎంతగానో ప్రశంసించారు. వాటిలో యెన్ని రికార్డు చేశారో తెలియదు.

శ్రీ సదాశివరావుగారు మాకు దగ్గర జ్ఞాతులైనా వరుసకు నాకు వారు అన్నగారైనా, మా మధ్య ఉన్న అనుబంధంలో సాహితీ బాంధవ్యమే అధికం. డాక్టరేటు పొందిన విద్యావేత్త లెందరో, ఓరుగల్లు వారే కాక, ఢిల్లీ, బొంబాయి, మదరాసు మొదలైన పట్టణహితులు వీరిని దర్శించి సంశయనివృత్తి చేసుకొనేవారు. నేను వ్రాసిన 'కైలాసదర్శనం' అనే గ్రంథాన్ని వారే స్వయంగా సంస్కరించి, ఇతర విధాల సహకరించి,నా కెనలేని మేలు చేశారు. వారిపట్ల నా రుణం తీర్చలేనిది. వారి మరణం నాబోటి వారికి తీరని లోటు. వారి ఆత్మకు శాంతి చేకూరాలని భగవంతుని ప్రార్థించటం కన్నా ప్రస్తుతం చేయగలిగిందేమి?

శ్రీ సదాశివరావుగారి మేధాసంపత్తి గురించి ఒక్క మాటలో చెప్పాలంటే ఒక పెద్ద సభాప్రాంగణ వేదికపై వారి నాహ్వానించి, అప్పటికప్పుడే మీకు తోచిన విషయం చరిత్ర, వాఙ్మయం, జాతీయం, అంతర్జాతీయం, కళలు, సాహిత్యం, లేదా జలచర ఖేచర, భూ, వనచర, భౌగోళికాది ఏ విషయమైనా మీరిచ్చి ఆ విషయానికి అనుకూలంగా గాని ప్రతికూలంగా గాని చెప్పమంటే అనర్గళంగా రెండుగంటలు ఉపన్యసించే సత్తా వారిది. దీనినిబట్టి వారి మేధాసంపత్తి మీరే ఊహించండి. ఈవిధంగా చూస్తే విజ్ఞులైన సర్వుల సంశయ నివృత్తికి సమాధానం సదాశివరావుగారే అంటే అతిశయోక్తి కాదు.

పరమపదించేనాటికి శ్రీ సదాశివరావుగారికి 76 సంవత్సరాలు. వారికి భార్య, ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు. వారంతా దాదాపు వారివారి వృత్తులలో స్థిరమైనారు. గత 26-8-1996 రోజున వారి అంత్యక్రియలలో నాతో పాటు శ్రీ పి.వి. రంగారావు (మాజీ విద్యా శాఖమంత్రి), శ్రీ పి.వి. రాజేశ్వరరావు (పార్లమెంటు సభ్యుడు), శ్రీ డి. దయాకరరావులతో పాటు ఎందరో వరంగల్ పురప్రముఖులు, శ్రీ కాళోజీ నారాయణరావు, మాజీ వైస్ ఛాన్సలర్ శ్రీ జయశంకర్, మున్సిపల్ ఛైర్మన్, ఇంకా మునిసిపాలిటీ సభ్యులు, రాజకీయ నాయకులు, స్వాతంత్ర్య సమర యోధులు, మొదలైనవారంతా పాల్గొని దివంగత మేధావికి ఘనంగా నివాళు లర్పించారు.

మన సర్వార్థ సంక్షేమ సమితి నిర్వాహకునిగా, విశ్వప్రకాశం ముఖ్యసంపాదకునిగా సంపాదకమండలి పక్షాన, విజ్ఞులైన విశ్వప్రకాశం పాఠకుల తరపున, దివంగత సాహితీ తపస్వికి ప్రగాఢ సంతాపం తెలియచేస్తూ, వారి కుటుంబీకులకు సాదర సానుభూతి ప్రకటిస్తున్నాను.

ఇట్లు

భవదీయుడు

**పి.వి. మనోహర రావు**

ముఖ్య సంపాదకుడు, విశ్వప్రకాశం

# అమృతం కురిసిన అరుణగిరి

- శ్రీ కస్తూరి భాస్కరరావు

*(గత సంచిక తరువాయి)*

"దేనిని తెలుసుకుంటే అపరిచ్ఛిన్నమైన అమృతత్త్వం వస్తుంది ? దేన్ని తెలుసుకొన్నంతమాత్రాన్నే అన్ని సంశయాలూ పూర్తిగా తొలగిపోయి, యింకవేరే తెలియనిది కాని, కొరతగింది కానీ ఏదీ వుండదో అట్టి అవేద్యమైన తత్త్వం ఏది?" అని విద్వాంసుడు, జ్ఞాని అయిన అష్టావక్రుడు ఈవిధంగా జవాబిచ్చాడు.

శుద్ధం, పరమపదం ఈ ప్రపంచానికి ఆధారం. స్వాత్మ కంటే భిన్నంగా తెలిసికొనేవాడే లేనందువల్ల అది తెలియదు. తెలుసుకువే జ్ఞాత లేడు - తెలుసుకునేదీ (జ్ఞేయం) లేదు బాహ్యదృష్టి మాని లోచూపుతో చూస్తే చిదాత్మను మించిన జ్యోతి యింకొకటి లేదని తెలుస్తుంది. మనస్సులెని సంకల్పాల్ని తొలగిస్తే, మనస్సు శుద్ధచితితో నిండి ఆత్మతత్త్వం తెలుస్తుంది. ఈ ఆత్మతత్త్వం పూసల్లోని దారంలాగా అన్ని జ్ఞానాల్లో అనుస్యూతంగా వుండే జ్ఞానం యొక్క నిజస్వరూపం! ఇతర వస్తువుల నుంచి మనస్సుని వెనక్కి త్రిప్పి, చూడదలచిన వస్తువు మీద దృష్టి కేంద్రీకరించాలి."

"అఖండమాద్యంత విహీనమేకం తేజోమయానంద ఘనస్వరూపమ్ ।
సమస్త సాక్షిం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మతత్త్వమ్ ॥"

జీవుడు పంచకోశాత్మకమైన గుహలో నిద్రించిన నిష్కళాద్వయ పరమార్థ స్వరూపాన్ని తెలుసుకుని ఆది అంతం లేని, అఖండమైన ఆనందఘనస్వరూపమై, సకలసాక్షియైన శుద్ధపరమాత్మ తత్త్వాన్ని పొంది బ్రహ్మజ్ఞుడై వెలుగుతాడని ఋభుమహర్షి శిష్యుడైన నిదాఘుడికి బోధించాడు.

లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనలు కాళ్లకు వేసిన సంకెళ్ల వంటివి. వాటిని వదిలించుకున్నవానికే మోక్షం లభిస్తుంది. మనస్సు అంతర్ముఖమైతే బాహ్యవాసనలన్నీ వదిలిపోతాయి. ఆత్మకు ఈ ప్రతిబంధకాలన్నీ తొలగిపోయిన అనుభవం కలుగుతుంది. బాహ్యవాసనలన్నీ క్షయమైపోతాయి. ఇదే మోక్షం ! జీవన్ముక్తి !

చైతన్యరూపమైన ఆత్మప్రకాశించటానికి వేరే ఒక సాధనం అవసరం లేదు. ఒక

దీపాన్ని చూడటానికి యింకో దీపం అవసరం లేనట్లే ! జ్ఞానులికి సర్వత్రా కన్పించేది ఆత్మే! అది శుద్ధచైతన్యజ్యోతి స్వరూపం ! ఆ జ్యోతిలో చీకటి లేదు ఆత్మలో అజ్ఞానం లేదు దాన్ని తెలుసుకోవటానికి వేరే యింకొక ప్రమాణం కూడా అవసరం లేదు. నీటిలో కరిగిన ఉప్పును మనం చూడలేనట్లే హృదయాకాశంలో ప్రకాశించే బ్రహ్మన్ని బాహ్యేంద్రియాలు చూడలేవు.

'శరణాగతి' అంటే ఏమిటో శ్రీరమణ మహర్షి యిలా వివరించారు - 'నీ మూలానికి నిన్ను అర్పించుకోవటం ఒక్కటే కర్తవ్యం ! నీ మూలం నీలోనే వుంది. శరణాగతి దానికే ! దాన్ని వెదకాలి. అవిద్యాబంధం నుంచి నిన్ను నీవు విడిపించుకుని ముక్తుడివి కావాలి !

"ఎప్పుడు నున్నది యేకాత్మవస్తువే
యప్పుడా వస్తువు నాది గురు - చెప్పక
చెప్పి తెలియగ జేసినారే, యెవరు
చెప్పి తెలుపుదురు చెప్పు ?" ('ఏకాత్మపంచకం' - రమణుల స్వీయరచన)

నీవు దైవానికైనా, గురువుకైనా, ఆత్మకైనా అంకితం కావాలి ! రమణులు అరుణాచలంలో జ్ఞానరూపులై వెలసి ఆత్మవిచారంతో ముక్తులై ముముక్షువులికి సూటిమార్గం చూపారు. భగవంతుని నిర్గుణ స్వరూపాన్ని తెలుసుకోవచ్చుగాని సగుణ స్వరూపం తెలియటం చాలా కష్టం. సగుణరూపంలో పరిచ్ఛిన్నుడుగా కన్పిస్తాడు. అట్టి వానిని పూర్ణుడుగా తెలుసుకోవటం ఎలా ? నిర్గుణుడిగా చూస్తే శూన్యుడుగా అర్థమౌతాడు. సగుణుడిగా దర్శిస్తే అన్నీ గుణాలే కన్పిస్తాయి. నీవు గుణ స్వరూపుడివి. అప్పుడు గుణాలకి కూడా ప్రాకృతం పోతుంది. 'నేను' - అనేది ఏమిటి ? అని నీలోనే నువ్వు తెలుసుకోవాలి. ఎక్కడో వెదకనక్కరలేదు. 'నేను' ఎక్కడో దొరకదు. మహానుభావులు ఆత్మను వేరుగా వెతుకరు - వారే ఆత్మ కనుక ! నీ సంగతి నీకు తెలిస్తే సర్వం గ్రాహ్యం అవుతుంది. 'నేను' అనే చోట సంఘాత మనే విపరీత భావం తీసేస్తే అసలు 'నేను' నీకు తెలుస్తుంది. ఇక్కడ నీవే మారాలి. 'నేను' నిష్ఠ చేయాలి. అప్పుడే ప్రపంచమంతా మారేది! మనస్సు దేహంలోనూ, చైతన్యంలోనూ కేంద్రీకృతమై వున్నాయి. 'ఎరుక' మాత్రం స్వతంత్రమైంది. దానికి శరీరాని కున్న ప్రేరణలు, తొందరలు, మనసుకున్న సుఖదుఃఖానుభూతులు వుండవచ్చు. కాని ఎరుకకు దేనితోనూ సంబంధం లేదు.

అదెప్పుడూ నిశ్చలంగా, నిబ్బరంగా, శాంతంగా, నిర్భయంగా వుంటుంది. దాన్నే ధ్యానించాలి. నిత్యజీవితంలో అదే నువ్వుగా వుంటే దాని సంపూర్ణత్వం నీలోనే సాక్షాత్కరిస్తుంది!

ఒకసారి భక్తుడొకడు రమణమహర్షిని ప్రశ్నించాడు - 'ఎల్లవేళలా ఎన్నోవిధాల నాకు తెలియవస్తున్న ఈ ప్రపంచం నిజం కాదని ఎలా ఒప్పుకోవటం?'

మహర్షి జవాబు - "ఈ ప్రపంచం నిజమని నిరూపించచూస్తావు. కాని నిన్ను నీవు ఎరుగక, తన్ను తెలియ యత్నించే నిన్ను చూచి ఆ ప్రపంచమే నవ్వుతుంది! మనల్ని సరిగ్గా మనం ఎరుగమని గ్రహిస్తే ఆ తర్వాత ప్రపంచాన్ని తెలుసునని నటించగలమా? ఎరిగెడు తనను ఎరుగక యితరము నెరుగుట అజ్ఞానమేకాని జ్ఞానమగునా? జ్ఞాన యితరముల కాధారమైన తనను ఎరిగినచో జ్ఞానాజ్ఞానాలు నశిస్తాయి" - తాను ఎరుగుటకు, తన్ను ఎరుగుటకు అన్యంగా ఏదీ లేదు. 'ఎరుకే' ఆ స్వరూపంగా గల ఆ సద్వస్తువు తెలియుట, తెలియనిది కాదన్నారు మహర్షి. ఆ శుద్ధసత్తు 'పరమమౌనస్థితి'! ఉత్తమ ఆత్మనిష్ఠ ! ఆ స్థితిలో పూర్ణమనస్సు తైలధార లాగా ఎడతెగక ఆత్మానుసంధానం చేస్తుంది. ఏ సాధనంతోనూ చావని మాయ పూర్ణప్రజ్ఞతో కూడిన మౌనంచే నశిస్తుంది. కాబట్టి ఈ స్థితి అన్ని సాధనల కన్న శ్రేష్ఠమైంది!

పరబ్రహ్మతత్త్వాన్ని ఆదిగురువు శ్రీ దక్షిణామూర్తి జ్ఞానవృద్ధులూ, బ్రహ్మ నిష్ఠాపరులైన సనక సనందనాది శిష్యులకు మౌనం చేతనే చిన్ముద్ర ద్వారా ఉపదేశించారు. ఆ మౌనబోధ వల్ల శిష్యులు తమ వ్యక్తిత్వాల్ని కోల్పోయారు. ఆత్మస్వరూపాన్ని ఎవ్వడూ వర్ణించలేరు. దానికి భాష చాలదు. శ్రీ రమణమహర్షి కూడా ఆ శుద్ధ తత్వాన్ని మౌనం ద్వారానే బోధించారు. భక్తుల సంశయాలు, సందేహాలు నివృత్తి అయ్యాయి. అది హృదయభాషణ! జ్ఞానదృష్టి! రమణతత్త్వంలో అనుభూతి ఎక్కువ. అది నిరంతర చింతనలో హృదయాంతరాళంలో వర్షించే అమృతధార! భక్తి, జ్ఞాన, కర్మల్ని సమన్వయించే సర్వవేదోపనిషత్తుల సారం! అన్ని సిద్ధాంతాల సమన్వయం! సత్యమతం - షడ్దర్శనాలసారం!

అరుణాచలం (తిరువణ్ణామలై) ప్రణవసారమైన జ్ఞానగిరి. పరమశివుడెప్పుడూ పరబ్రహ్మ, లింగ, సిద్ధ రూపాల్లో వుంటాడు. అరుణగిరిలో లింగం కొండరూపంలో వుంది మొదట దివ్యమైన కాంతిస్తంభం రూపంలో వెలసిన రూపం ఆ కొండలో అదృశ్యమ లింగాకారంగా వ్యక్తమయిందట! 'నేనెవరు?' - అనే విచారం అంతరంగంలోకి లోతుగా నిమగ్నమై ఆత్మగా సంస్థితుడై చేస్తే అదే శివుడవుతుంది. 'నేను వున్నాను' అనటమే

శివతత్త్వం! నేను ఏదిగా వున్నానో అదే నేను. ఆయన లేకుండా వేరేదీ వుండదు. ప్రతి వస్తువు శివునిలోనే, శివునివల్లనే తన అస్తిత్వాన్ని కలిగివున్నది మారకుండా వుంటే చైతన్యం ఒక్కటే శాశ్వతమైంది. అదే ఆత్మ! శివుడు! ఆయన ఎల్లప్పుడూ సాక్షాత్కరించే వున్నాడు ప్రతి జీవీ మూర్తీభవించిన పరమాత్మ స్వరూపమే! తనలోని అట్టి ఆత్మరూపాలు బాహ్యాభ్యంతర ప్రకృతుల్ని జయించటం ద్వారా అవ్యక్తం చేయటమే జీవుడి లక్ష్యం! ఈ పనిని కర్మ చేతగాని, భక్తి చేతగాని, ధ్యానం చేతగాని, యింద్రియనిగ్రహం చేతగాని - వీటిలో ఏ ఒక్కదానిచేత లేక అన్నింటిచే గాని సాధించి ముక్తుడువి కావాలి. ఇదే సర్వమత సిద్ధాంతం!

అరిషడ్వర్గాల్ని జయించి శరీర మంటే ఆత్మాభిమానాన్ని కలిగించే అజ్ఞానాన్ని, మోహాన్ని తొలగించటం అవసరం. ఎందుచేతనంటే మనస్సే బంధహేతువు కాబట్టి. ఆ మనస్సును విషయాల నుండి మరల్చాలి - ఆత్మవశం చేయాలి. మనస్సే ప్రపంచం కాబట్టి దాన్ని శుద్ధి చేసుకోవాలి. దానినిబట్టే నడవడి వుంటుంది చిత్తం ప్రశాంతంగా వుంటే శుభాశుభ కర్మలన్నీ నశిస్తాయి. కర్మక్షయం అవుతుంది. ఆవిధంగా శాంతచిత్తుడు ఆత్మలో లీనుడైనప్పుడు అక్షయానందం కలుగుతుంది. మనస్సు నిర్మలినమై, రాహిత్యం చెందటం వల్ల జీవభారం నశిస్తుంది. అప్పుడు స్వయంప్రకాశమైన ఆత్మయే మిగులుతుంది. ఆత్మజ్ఞాన నిష్ఠాపరుడు సర్వాన్నీ ఉద్దీపింపచేస్తాడు అప్పుడే అమృతత్త్వం - శాశ్వతానందం లభిస్తుంది!

తన్ను తాను తెలుసుకోవటానికి ఏ ఉపదేశం లేదు - ఉపదేశించేవాడూ లేడు. 'నాది2 అని కన్పించే సర్వాన్ని త్యజించి దేనిని త్యజించటానికి శక్యం కాదో అదే నీ అసలు స్వరూపం! దాన్నే తెలుసుకుని పరమశ్రేయస్సును పొందాలి!

అంతటా భగవంతుణ్ణి దర్శించాలంటే మొదట మనస్సులో భావించాలి. ఆ భావనే ధ్యానం - ఆ ధ్యానమే అనుభూతికి దారితీస్తుంది. అనుభూతి ఆత్మలో కలగాల్సిందే! భగవధ్యానం, ఆత్మజ్ఞానం - రెండింటి లక్ష్యం ఒక్కటే! కర్తృత్వబుద్ధి వల్లనే ప్రపంచం భేదమయంగా కన్పిస్తుంది. దాన్ని వదిలితే భేదాలు అంతర్ధానమై ఏకమైన సత్యం నీలోపలే సాక్షాత్కరిస్తుంది. కర్తృత్వ బుద్ధి వదలాలంటే కర్త ఎవరో తెలుసుకోవాలి. దానికోసమే అన్వేషణ చేయాలి. అదే విచారమార్గం - సూటిమార్గం !

